# గృహలక్ష్మి

# GRIHALAKSHMI

*15th DECEMBER 1954*

VI. No. 23

***Price As. 6.***



# మహిళల ఆరోగ్య రక్షణకు

## లోధ్ర

### గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూలలు, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, నూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరిచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును.

12 ఔ. రు. 4-4-0 6 ఔ. రు. 2-4-0

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కురుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయేగాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0 6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాతవ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మనదేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియువస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీజబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీవ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీవ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0-0

## కేసరి కుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు



అలసట మానవుని జయిస్తుంది



**తేనీరు**

అలసటను
జయిస్తుంది

PSTB 126

టీ బోర్డు ప్రకటన.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

వ్యవస్థాపకులు

**డాక్టరు కే. యన్. కేసరి**

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య




సంపుటము ౨౩] డిశంబరు 1954 [సంచిక ౧౨



# వి ష య సూ చి క





---


టెలిగ్రామ్స్ : సెల్ఫ్‌హెల్ప్. ఫోను. నెం. 55165

## నవభారత్ ఏజన్సీస్ లిమిటెడ్

18, ఆదియప్పనాయక్ స్ట్రీటు, మద్రాసు 1.

**అన్ని రకముల గాజు సామానులు**

★ గృహోపకరణములకు ★ వైద్యశాలలకు

★ పరిశోధనాలయములకు ★ ఔషధములు నిల్వచేయుటకు

**కావలయు సామగ్రి మావద్ద లభించును.**

విక్రేతలు, పంపిణీదార్లు.

**ప్రఖ్యాతిగాంచిన భారతీయ పారిశ్రామిక సంస్థల ప్రతినిధులు.**


---



సంతాన సౌభాగ్యము




జయజయ గృహలక్ష్మీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సాంస్కృతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# ఎన్నికల సంరంభము

ఆంధ్ర రాష్ట్రంలో ఎన్నికల కోలాహలము చెప్పనలవి కానట్టిదిగా రూపొందుతున్నది. కాంగ్రెస్ నాయకత్వము తన పూర్వపుపేరు ప్రతిష్టలను, త్యాగాలను, సాధించిన విజయాలను ఆధారంచేసికొని యికముందు సయితం ప్రజలు కాంగ్రెస్‌నే బలపరుస్తారని ముందుకు సాగుతున్నది. ఇక కమ్యూనిస్టు నాయకత్వము "అధికారం చేపట్టాలి" అనే నినాదంతో ముందు వెనకల చరిత్రతో సంబంధములేదన్నట్లు ముందుకు నడువ ప్రయత్నిస్తున్నది. ఇక ప్రజాపార్టీ, ప్రజాసోషలిస్టులు, కృషికార్ లోక్‌పార్టీ తాము విజేతలయి వ్యక్తిగతంగా అధికారంలోకి రాలేకపోయినా సమయానుకూలంగా అవకాశవాదులుగా వ్యవహరించగలమనే యుద్దేశంతో ఎన్నికలలో పోటీచెయ్యబోతున్నారు. ఇక స్వతంత్రులుగా ఎన్నికలలో పాల్గొనడానికి ఉద్యుక్తులగుతున్న వారి సంగతి అసలే చెప్పనక్కరలేదు - వాళ్లు స్వతంత్రులు-వాళ్లు ఎన్నుకోబడితే ఏమిచేయకలుగుతారో, ఏమిచేస్తారో-వాళ్ళు ప్రజాప్రతినిధులుగా ప్రజాశ్రేయస్సుకు ఏపాటి దోహదమివ్వగలరో అనిశ్చితం. ఈ వాతావరణంలో ఎన్నికలుజరిగి నూతన మంత్రివర్గ నిర్మాణం కావలసియుంది.

కాంగ్రెస్ నాయకత్వము లోపరహితమయినదని చెప్ప సాహసించడంలేదు ; కాని జాతీయ సిద్ధాంతాల కనుగుణ్యంగా కొద్దో గొప్పో క్రమశిక్షణతో ప్రజలకు యీనాడు నాయకత్వము వహించ అర్హతగలది కాంగ్రెస్ మాత్రమనే చెప్పాలి. దారి, డొంక, క్రమశిక్షణలేకుండా దేశానికి, ప్రజలకు ఏది హితమో, ఏది హానికరమో గుర్తించకలుగని జాతీయశక్తుల నాయకత్వము కాంగ్రెస్ నాయకత్వముకంటె మేలైనది కాగలదని ఏభారతీయుడు తలచలేడు. ఈ పరిస్థితులలో కాంగ్రెస్ నుండి చీలిపోయి ప్రత్యేక జాతీయశక్తులుగా రూపొందినవి తిరిగి కాంగ్రెస్‌లోనేచేరి, చిత్తశుద్ధితో వ్యవహరించి, కాంగ్రెస్ నాయకత్వములోని లోపాలను రూపుమాపి సంస్థను బలిష్టంగాను, ప్రజోపయుక్తంగాను చేయాలి. జాతీయశక్తులు సంఘటితపడిననాడుగాని జాతీయతకు, శాంతిభద్రతలకు అవకాశాలు విస్తృతంకావు.

ఎన్నికలలో పోటీచేయనున్న అభ్యర్థుల నిర్ణయ సందర్భమున యీ ప్రాంతైనా స్త్రీలకు ఉచితస్థానము లభించగలదని, సాంఘిక, ఆర్థికరంగాలలో అనేక సమస్యల పరిష్కార సందర్భమున మహిళా ప్రతినిధులను శాసన సభకు ఎన్నుకోవలసిన ఆవశ్యకతను ప్రజలు గుర్తించగలరనియు, ఇందుకుగాను కాంగ్రెస్ నాయకత్వము అనుకూలమైన వాతావరణమును సృష్టించగలదని నమ్ముచున్నాము.

———o———

## మహిళా సంఘము, అమలాపురము

డాక్టర్ (శ్రీమతి) జి. సరస్వతిబాయిగారి అధ్యక్షతన మహిళా సంఘపు ప్రథమ సమావేశములో సంఘముయొక్క ఆదర్శలక్ష్యములను గురించిన తీర్మానములు చర్చించి ఏకగ్రీవముగా తీర్మానించిన పిదప కార్యవర్గ ఎన్నికలు జరిగెను. డాక్టర్ (శ్రీమతి) జి. సరస్వతిగారు అధ్యక్షురాలుగాను, శ్రీమతి బెబియ్యంసోదెమ్మ, కందా సత్యభాస్కరం, యం. ఎ. గారలు ఉపాధ్యక్షురాండ్రుగాను, కార్యదర్శినులుగా శ్రీమతులు జి. రాణిఝాన్సీలక్ష్మీబాయి బి. ఎ., సి. ఝాన్సీలక్ష్మీబాయిగారలును, శ్రీమతులు మాచిరాజు సీతారామమ్మ, డి. యస్. కృష్ణమూర్తి సతి, వి. కమల, గ్రంధి ధనలక్ష్మి, పి. వెంకటరత్నంగారలు సభ్యురాండ్రుగాను ఎన్నుకోబడిరి. పోషకులుగాను, యావజ్జీవ సభ్యులుగాను, సాధారణ సభ్యులుగాను చేరుటకు క్రమముగా రు 1116, రు. 116, రు. 1-0-0, రు 0-8-0 గను నిర్ధారణ చేయబడినది. స్థానికంగా స్త్రీల పురోభివృద్ధికి కృషి చేయడం యీ సంఘముయొక్క ముఖ్య కార్యక్రమమట.

# ఏకోదరులు

| రచయిత : | అనువాదకుడు : |
|---|---|
| గోథే మహాకవి | డాక్టరు వి. ఎన్. శర్మ |

## రచయితను గురించి

[జర్మను సాహిత్యంలోని పంథాలు చాలవరకు భారత సాహిత్య మార్గాల ననుసరించే వుంటాయి. పాఠకులను భౌతిక వాంఛలతో తృప్తిపరచనీయకుండా, ప్రత్యక్షంగానైతేనేం, పరోక్షంగానైతేనేం, భూతల ప్రపంచపు సరిహద్దులను పడగొట్టి మన పూర్వులు వాంఛించే అసతోమాసద్గమాయి, తమసోమాజ్యోతిర్గమయి, మృత్యోర్మామమృతంమయికి తీసుకొనిపోతుంది. అందుచేతనే జర్మను సాహిత్యాన్ని విశ్వసాహిత్య మంటారు. ఈ సాహిత్యసేవలో తన జీవితాన్నంతా సమర్పించి ధన్యుడయిన మహానీయుడు గోథే (Goethe) కవిచక్రవర్తి. గోథే 1749 సం॥లో జన్మించాడు. 1832 సం॥లో కీర్తిశేషుడయ్యాడు.

ఈయన సాహిత్యలక్ష్మికి సమర్పించిన రచనలు ఎన్నో కలవు. వాటిలో ముఖ్యంగా పేర్కొనవలసింది అతని నాటికలు. ఈ నాటికలలో మానవుడు జీవయాత్రలో అనుదినం ఎదుర్కొనవలసిన క్లిష్ట సమస్య లెన్నిటినో చిత్రించాడు. వాటిని శాంతంగా, విశాల దృష్టితో చూడాలి. అప్పుడే వాటిని అవలీలగా, నిర్భయంగా చక్క చేసుకోవచ్చు. అలా చేస్తిమా మనస్సుకూ, అంతేకాదు - అచంచలమైన ఆత్మకు శాంతి లభిస్తుంది. ఇట్టి ఉన్నతా దర్శాన్నే ఈ నాటికలద్వారా గోథేకవి లోకానికి నిర్వచించాడు. ఇట్టి నాటకాల్లో ఫస్ట్ (Faust) చాలా పెద్దది. దాన్ని కొంతవరకు కాళిదాసకవి రచించిన శాకుంతలంతో సరిపోల్చవచ్చు.

ఇందులో ప్రచురింపబడుతూవున్న ఈ ఏకాంకిక గోథే రచనల్లో చాలా చిన్నది. దీన్ని గోథే విద్యార్థి దశలో రచించాడు. 1776 సం॥లో – అప్పటికి ఆయన వయస్సు 27 సంవత్సరాలే–వైమారు

రాజు ఆహ్వానంపై మంత్రిపదవి నలంకరించడానికి వైమారు నగరానికి వచ్చాడు. రాజు కోరికపై ఈ నాటకాన్ని ఆ సంవత్సరంలోనే రాజ దర్బారులో ప్రదర్శించారు. అందలి ముఖ్య పాత్రను గోథేకవే ధరించి నాటకకళలో తనకున్న నైపుణ్యానంతా నాటకరంగంమీద చూపాడు.

## ఇందు వచ్చే పాత్రలు

విల్ హెం:_జర్మను మధ్య తరగతి పట్నంలో వ్యాపారాన్ని నిర్వహించుతూవున్న వర్తకుడు. భార్య చని పోయింది.

మరియానా:_విల్ హెం కూతురు. కాని ఆ పిల్లకు ఈ రహస్యం తెలియదు. ఆయన్ను తన అన్నయ్యగా భావించి ఆయన పోషణ బాధ్యతనంతా నిర్వహించుతూ వుంటుంది.

ఫాబ్రిస్:_పొరుగూరి మధ్య తరగతిలో పుట్టి పెరిగిన యువకుడు. అతడూ వర్తకసరళిలోనే తర్ఫీతు అయిన వాడు. విల్ హెం అంటే ఎంతో ఇష్టం. మరియానాను ప్రేమించాడు.]

## నాటకరంగం

నాటకం ఏకాంకం. కథ విల్ హెం ఇంట్లోనే సాగుతుంది. ఇందు 18-వ శతాబ్దంలోని జర్మను ప్రజా జీవితం. అందు ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబాల జీవితచర్య చక్కగా చిత్రింపబడుతుంది.

### మొదటి రంగం

విల్ హెం:_(టేబుల్ దగ్గర కూర్చుండి ఖాతా పుస్తకాలను, వుత్తరాలను చూస్తూవుంటాడు).

ఈ వారంలో కూడా కొత్తబేరాలు వచ్చాయి. ఇక విధీ విరామం ఏలావుంటుంది మరి? చూడ్డానికి నేనుచేసే వర్తకం అంత పెద్దదీకాదు. కాని ఇది నానాటికీ పెచ్చుపెరిగిపోతూనేవుంది. నాకూ దీన్ని చక్కబెట్టుకోటానికీ ఎంతో ఇష్టం. పరపతి బాగానే వుంది. దానివల్ల లాభం బాగానే వస్తూవున్నది. (వెలుపల చప్పుడు) ఎవరక్కడ?

(తపాలా బంట్రోతు తలుపును దభాలున తెరిచి లోపలికి వస్తాడు)

బంట్రోతు:_చాలా బరువయిన బంగీని మీకు తీసుకొని వచ్చాను. ఇరవైమార్కులు (మార్కు-జర్మను నాణ్యం. మార్కు రూపాయి నాలుగుఅణాల విలువలో వుంటుంది) దీనికి చార్జీ అవుతుంది. సగాన్ని ఆవూరి వాళ్లే చెల్లించుకొన్నారు.

వి:_మంచిది. మంచిది. దాన్ని అక్కడుంచు. దీన్ని పంపుతున్నానని ఆయనే నిన్న వుత్తరాన్ని రాసాడు.

(బంగీని బల్లమీదవుంచి బంట్రోతు వెళ్లిపోతాడు)

(విల్ హెం బంగీని విప్పి, దానిలోని వస్తువులను తదేక దృష్టితో చూస్తాడు.)

వీటికోసమే ఇన్నాళ్లూ ఎదురుచూస్తూ వున్నాను. ఫాబ్రిస్ ఇవ్వాళే వస్తానని చెప్పాడు. ఆయనకు చెల్లించాలసిన సొమ్మును ఆయన వచ్చిన వెంటనే ఇచ్చెయ్యాలి. ఆయన ఎంతో మంచివాడు. అట్టి స్నేహితుల మంచితనాన్ని ఏమాత్రమూ చెడగొట్టుకో కూడదు. నిన్న ఆ వూళ్లో ఆయన్ను కలుసుకొన్నప్పుడు రేపే నన్ను చూడ్డానికి వస్తానని అన్నాడు. ఎందుకలా అంటాడని అప్పుడు ఆశ్చర్యంవేసింది.

సొమ్మసంగతి ఏం చెప్తావని అడగడానికే ఈ విధంగా అన్నాడనే భావించాను. వర్తక సరళి ఆయనకు బాగా తెలుసు. అలా అడగకపోతే సొమ్ము చేతి నుండి ఇస్తానికి బుద్ధిపుట్టుతుందామరి? నేనూ ఇతర్లు ఇయ్యాలసిన డబ్బుకోసం అలాగే అడగటంలేదా? (నోట్లను బంగీలోనుండి తీసి బల్లమీద పెట్టాడు. వాటిని లెక్కపెడతాడు) వ్యాపారం చేస్తూవున్నప్పుడు బాకీదార్లను అనవసరంగా తొందరపెట్టకూడదు. అందుచేతనే ఇంతవరకూ ఎవర్నీ ఏ మాత్రమూ తొందరపెట్టినవాడ్ని కాను. వాళ్ళ మనోభావాలనూ మనం చక్కగా గుర్తించాలి. కొంతమంది ఖాతాదార్లు నన్ను చూస్తేనేచాలు వెనుకంజేసి పోతారు. మరికొందరా! ఏమీ మాట్లాడకుండానే వుంటారు. అవును ఇదిలోకం. ఆ తత్వాన్ని కొంచెం తెలుసుకోవాలి. ఇట్టివార్ని చూస్తే నాకే ఎంతో జాలి వేస్తుంది. ఎందుకు వచ్చింది చెప్పు ఇంతజాలి? (లెక్కపెట్టడం పూర్తిఅయ్యాక నోట్లను డ్రాయర్లో దాచివేస్తాడు) అంతా భగవానుని దయ! ఆయన కరుణాకటాక్షాలు మనమీద లేకపోతేనా! అంతా అయోమయమవుతుంది. దేవా! దేవా! ఇవిగో నా నమస్కారాలు. వీటిని పుచ్చుకొని నన్నీకష్టాల్లోనుంచి దరిచేర్చవలసిన భారమంతా నీదే! నీదికాక మరెవ్వరిది? నేనెదుర్కొంటూవున్న కష్టాల్లోనుంచి రక్షించావు. మళ్ళీ అందరి ముందూ తలయెత్తి చూట్టానికి ధైర్యాన్ని, సాహసాన్ని ప్రసాదించావు. దేవా, నా కృతజ్ఞతనంతా నీకు తప్ప మరెవ్వరికి తెలుపుకోవాలి (ఖాతా పుస్తకాన్ని తెరుస్తాడు. దాన్ని కొంచెం సేపు చూస్తాడు) నీ ప్రసాదంవల్ల ఈ కష్టాల్లోనుంచి ఇప్పుడు తేరుకొన్నాను. ఇక ధైర్యంతో నా వ్యాపారాన్ని సాగించవచ్చు. నష్టంవచ్చినా ఫరవాలేదు ... ఇప్పుడేమని అంటున్నాను? ఎందుకు వచ్చింది ఈ పాపిష్టి ఆలోచన? వద్దు వద్దు ఎప్పటికీ వద్దు అట్టి ఆలోచన... ఇంతకూ ఏం చెప్పాలనుకొన్నాను మరి... ఆ! ఆ! తెలిసింది, బాగా తెలిసింది... నీ వెంతో సహాయాన్ని ఈనాడు ప్రసాదించావు. ఇది నాకెందుకుచెప్మా! ఆ పిల్ల ఎంతో గుణవంతురాలు. అది ఇంట్లో లేకపోతేనా? ... నేనెందుకు ఇక్కడ వుండాలి? ఈ వ్యాపారాన్ని ఎందుకు జరపాలి? జీవితం గాఢాంధకారమైన అరణ్యం! ఎన్ని కొండలున్నాయి? ఎన్ని నదులు యథేచ్ఛగా ఇందులో అహోరాత్రాలు ప్రవహించుతూ వున్నాయి? ఈ అరణ్యంలోనుండి బయటికి రావాలంటే దోవను చక్కజేసుకోవాలి! ఎన్నో వంతెన్లను కట్టాలి ... ఎందుకు కట్టాలి అనవసరంగా ఈ వంతెన్లను ఈ చీకటి అడివిలో? ...... మరియానా, మరియానా. ఎక్కడవున్నావు? నీ సోదరుడుచేసే పని అంతా కాకపోయినా, కొంచమైనా తెలుసుకొన్నావా?... ఇదంతా ఎవరికోసం మరి? అంతా నీకోసమే కాదూ! ... పాపం, ఆ అమ్మాయి ఇంకా చిన్నపిల్ల! ఆ అమ్మాయికేం తెలుసు? అన్ని సుఖాల్ని నాకోసం త్యజించి నా దగ్గిరేవుంది. ఎంత వోపిక పాపం ఈ పిల్లకు అన్నయ్య పోషణ్ణాని చూచుకోటానికి? నేనంటే దానికి ఎంతో ప్రేమ ... తన సొంత సోదరుడ్ని నన్ను చక్కగా చూట్టానికి రాత్రీ పగలూ కష్టపడుతుంది... విధి విధి, అలాగున్నది. ఇదే మిగిలిపోయింది... అమ్మాయీ, నీవే ఆనందంతో వుంటే అదేచాలు. అదే నా ఆనందంకూడా!

మరియానా:—(ప్రవేశిస్తుంది) అన్నయ్యా-పిల్చావా! ఏం కావాలి? ఎందుకు పిల్చావు?

విల్ హెం:—నిన్ను పిలవలేదమ్మా.

మరి:—బాగానేవుంది నీ జవాబు! నన్ను పిలవలేదూ! పనంతా వదిలేసి వంటింటిలోంచి వచ్చాను - మరి నువ్వు పిలుస్తున్నావనుకొని?

విల్:—ఏమిటా గాభరా? భూతాలనూ, భేతాళాలనూ గురించి కలలు కంటున్నావా మరి? అవి పిలుస్తున్నవనుకొనేనా ఇక్కడికి అంత గాభరాతో వచ్చావు?

మరి:—ఆ సంగతినా ఇప్పుడు తలంచటం! అవేం మనకు బొత్తిగా వద్దు...నీ గొంతే వినబడ్డది. ఇన్నాళ్లూ నీ దగ్గిరే వున్న నాకు ... ఆ స్వరం తెలియదనుకొన్నావా అన్నయ్యా?

విల్ :—సరేలే... మరీ చెప్పావు కాదూ? అక్కడేం చేస్తున్నావమ్మా?

మరి:—కూరగాయల్ని కోశాను. ఫ్రాన్సిస్ వస్తాడు కాదూ ఇవ్వాళ-ఆయన మన ఇంట్లోనే భోంచెయ్యాలి. భోజనానికి అంతా సిద్ధం చెయ్యొద్దూ మరి?

విల్ :—అవునమ్మా. అతిథిసత్కారమంటే నీకు ఎంతో ఇష్టం. ఆ సంగతి నాకు తెలియదనుకొన్నావా?

మరి:—ఇక నేను వెళ్ళాలి? ఆలస్యమేమాత్రం చేసినా నీకూ కష్టంగా వుంటుంది కాదూ? ఆయన వచ్చాక కొత్త పాటను నేర్చుకోవాలి. ఆయన్ను అడుగుతావు కాదూ మంచి పాట నొకదాన్ని ఇవ్వాళ నేర్పించమని?

విల్ :—తప్పక-ఒక పాటేనా. ఇంకా ఎన్నో మంచి పాటలనూ నేర్చుకోవచ్చు.

మరి:—అప్పుడాయన నేర్పిన పాట ఎంతో బావుంది. ఇవ్వాళ ఆయన మన ఇంటికివచ్చాక, దాన్నే పాడ్తాను. నీకూ సంగీతమంటే ఎంతో ఇష్టం కాదూ?

విల్ :—నీకెలా తెలుసమ్మా?

మరి:—ఆ సంగతి తెలియదనుకొంటున్నావా అన్నయ్యా? మగవాళ్లు పాటలంటే చెవికోసుకొంటారు ... సరేలే ఈలా కాలక్షేపం చేస్తూ వుంటే ఆ పని నేలా ముగించగల్గుతాననుకొంటావు? సరేకాని ఎందుకు పిలిచావో చెప్పాలి ... దీనికి జవాబియ్యడానికి ఇష్టంలేకపోతే ఒక ముద్దియ్యి మరి?

విల్ :—తప్పక (ముద్దిస్తాడు) భోంచేసాక పళ్ళను పుచ్చుకోటం ఆయనకు ఎంతో ఇష్టం. వాటిని సిద్ధం చేస్తావు కాదూ?

మరి:—తప్పక. ఆ సంగతి నీవు చెప్పనక్కరలేదు. అది నాకు తెలియదనుకొంటావా?...... ఇక నేను వెళ్ళాలి. పొయ్యిమీద పదార్థాలున్నాయి. వాటిని తీయకపోతే మాడిపోతాయి.

(వెళ్ళుతుంది)

విల్ :—నా అదృష్ట దేవతకాక మరెవ్వరని చెప్పాలి ఈ పిల్లను! నా తలంపులన్నీ తెలుసు, బాగా తెలుసు ... హృదయేశ్వరీ! దీనినంతా చూస్తున్నావు కాదూ. నీవు నన్ను విడిచి వెళ్ళిపోయావు. నీ ప్రతిబింబమే ఇది. దాన్ని చూసుకొంటూ నా విచారాన్ని మరిచిపోవాలి. అందుకోసమే కాదూ దాన్ని నాకిచ్చిపోయ్యావు? ఆ నిధే నా దగ్గర వున్నంతకాలం నీవు పొయ్యావని నాకెందుకు దుఃఖం వుంటుంది ... ఔను, అందరికీ తెలుసు. అదిఎవరో, నేనెవరో అని ... ఒక్కసారి నా మాటవినాలి చార్లొటా? నా హృదయేశ్వరీ! నిన్నెంత ప్రేమించానో అది నీకు బాగా తెలుసు. నీవు పొయ్యేటప్పుడు నీ కూతుర్నే నాకిచ్చి పొయ్యావు! నా మనోవాంఛలన్నింటినీ దీర్చావు. ఈ అయోమయపు జీవితాన్నే ఒక దోవకు తెచ్చి పెట్టే వెళ్ళావు. నీ పిల్లనే ఎంతో గారాబంగానే పెంచుతున్నాను. ఇక నీవు దాని విషయం ఏమాత్రం బెంగపెట్టుకోనవసరమే లేదు ...అయితే ఇప్పుడో? ... నీ బింబమే ఇక్కడవున్నా ... తిరిగి నీవే వస్తావనుకొన్నాను. ఆ రోజుల్లోవలె హాయిగా కలిసిమెలసి వుందామనుకొన్నాను.... విధి ఈలాగయిపోయింది, దానికి మనమేంచేస్తాం? ... ఇది కలా? మరి మాయని లేక దీన్ని మరేమని చెప్పేది ...... నీవా .. అవును, నీవు ఎంతో అదృష్టవంతురాలివి. ఈ అష్టబంధాలనూ పూర్తిగా వదిలించుకొని ఆనంద సాగరంలో తేలి ఆడుతున్నావు. నిజంగా సౌఖ్యమంటే నీదే. మరెవ్వరికివస్తుంది ఇంతసౌఖ్యం...ఈజన్మలో...ప్రభూ! ప్రభూ! నీవే నాహృదయేశ్వరిని నీపాద సన్నిధికి దీసుకొనివెళ్ళావు. నా హృదయేశ్వరి పట్ల చూపుతూవున్న ప్రేమనే మాకూ ప్రసాదించావు. కష్టాల్ని ఎన్నిట్నో చూచాను. వాటిని కష్టాలని

ఏలా చెప్పగల్గుతాను! నీ దీవెనలవల్ల ఈలా నేనూ ఈ ఆనందసాగరంలో వున్నప్పుడు ...

(తలుపును ఎవ్వరో తట్టుతున్నట్లు శబ్దం, మెల్లగా తలుపును తెరుచుకొని ఫాబ్రిస్ లోపలికి వస్తాడు...)

ఫాబ్రిస్:—నమస్కారం, నమస్కారం ... మీరేదో పన్లో వున్నట్లుందే...

విల్:—ఫరవాలేదులే. నీకోసమే చూస్తూవున్నాను. వచ్చావు. ఎంతో సంతోషం. ఈలా వచ్చి కూర్చో. ఈ వేళ నీవు వస్తావని విన్నప్పటినుంచీ ఎన్నో ఆలోచనలు పొంగిపొర్లి వస్తున్నాయి. ఇవన్నీ వ్యాపారం బాదరబందీవల్ల కాదులే... నీకు ఇవ్వాల్సినసొమ్ము ఇప్పుడే తీసుకోవాలి ... బాకీదారుడొకడు పెద్ద మొత్తాన్నే ఇ-వ్వా ళే పంపాడు. అది నా అదృష్టంకాక మరేమని చెప్పాలి ... దీన్ని నీపర్సులో జాగ్రత్తగా దాచి పెట్టుకోవాలి... పత్రాన్ని రద్దుచేసే విషయాన్ని తరువాత ఆలోచించుకోవచ్చులే. దానికి ఇప్పుడేం తొందరవుంది మరి?

ఫా:—డబ్బుకేంతొందరవచ్చింది? నా కిప్పుడదిఅవసరంలేదు. మీవ్యాపారానికే వాడుకోవచ్చును.

విల్:—ప్రస్తుతం సొమ్ము అవసరంలేదు. అవసరం వుంటే తరవాతే తీసుకొంటాను; కష్టకాలంలో సహాయంచేసావు. ఈ సహాయానికి ఎంతో కృతజ్ఞుడి ... ఇవ్వాళే చార్లొటా చనిపోయినరోజు. ఈ రోజున్నే నాకు బాకీదార్లనుండి రావలసిన సొమ్మొ వచ్చింది. నీ బాకీనీ ఇవ్వాళే తీర్చుకొనే అదృష్టంకూడా లభించింది. అన్ని శుభాలు ఈ రోజులోనే వచ్చాయి...

ఫా:—ఔను. తప్పక అన్నిశుభాలు నీవంటి అదృష్టవంతుడికి రాకుండా ఇతర్లకు వస్తాయామరి!

విల్:—అంత పొగడవద్దు...కాని ఇవన్నీ నీకు చెప్పివేస్తేనేకాదూ నాకూ ఆనందం. చార్లొటా మా ఇంటికి సౌభాగ్యలక్ష్మి. చార్లొటా మాఇంటికి...

ఫా:—ఆ విషయాన్నే విన్నాను. ఆమెసంగతీ నాకూ కొంత తెలుసు. అవును నిజంగా నీవే అదృష్టవంతుడివి...

(స శేషం)

—o—

తల్లి తన కుమార్తెను తోడి బాలికలతో గుడికి పంపిస్తూ రెండణాలుచేతికిచ్చి "ఒక అణాను గుళ్లో దేవుడికి కానుక వెయ్యి; మరొక అణాకు మిఠాయీలు కొనుక్కొనితిను" అని చెప్పింది.

నడిచి పోతూపోతూ దారిలో కాలుజారి పడిపోగా చేతిలోని రెండణాలలో ఒకణా ప్రక్కనున్న మురికికాలవలో దొర్లిపడిపోయింది.

ఆ పిల్ల లేచి వెక్కి వెక్కి ఏడుస్తూ "భగవంతుడా! నీకు కానుక వెయ్యడానికని అమ్మయిచ్చిన అణా కాలువలోపడిపోయింది-నేనేంచేసేది" అంటూ వాపోయింది.

'రమేష్'

♦ ♦ ♦

ఏదేశభక్తుడైనాసరే తన సోదర ప్రజానీకపు శ్రేయోభివృద్ధులను నిర్లక్ష్యముచేసినచో దేశము పురోభివృద్ధిగాంచలేదు.

♦ ♦ ♦ ♦

ప్రపంచమునందు మరెక్కడను మనకుగల పుష్కలమైన సాంస్కృతిక, వైజ్ఞానిక, సాహిత్య సంపద లేదు. మనము దానిని అర్థముచేసికొని స్వప్రయోజనాలకుపయోగించుకొనకలుగలేదు సరిగదా దానిని చిన్న చూపు చూస్తున్నాము.

గాంధీజీ'

# పవనసందేశము

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ

(సెప్టెంబరు సంచిక తరువాయి)

పొంగారెడి యమునానది-రంగారెడి తోట లెంతో రమణీయలునౌ
శృంగారవతులు జూడ్కి-కనంగ శరంబులాయనంగ నలరుదురందుఁ.
లలితోద్యానవనంబులు-చెలువగు హర్మ్యములు సకలసిరులకు నెలవై
యలకాపురమో యనగా-నలరెడి మధురాపురంబు నారయపవనా.
ఆ పురమందున సుఖియై-గోపాలుం డున్నవాఁడు గోపీవశుఁడై
యేపగిది నతనిఁగాంతువొ-తాపము భరియింపలేను దారగుణాఢ్యా.
ఆయున్నత సౌధంబుల-నేయెడఁ నున్నాడటంచు నేవచియింతుఁ.
ధీయుత నీవెఱుఁగని తా-వేయెడఁ గల దరసి చూడు మాప్రాణసఖా!
నల్లనైనవాఁడు నగు మోము గలవాడు-చూడఁదగినయట్టి సొగసుకాఁడు
కంబుగళమువాఁడు కంజాతనేత్రుండు-సుందరుండు నందనందనుండు.
నీల నీరదవర్ణుండు నిరుపమాన-కనక చేలంబు కటిసీమ దనరువాఁడు
బర్హిపింఛంబు సిగపైని వరలువాఁడు లలితవనమాల యురమునఁ జెలఁగువాఁడు.
అల మధురాపురసౌధం-బులలో నున్నాడు యతని ముంగలపవనా
వలపు మదికెక్క బలుకుము-పలుకుపలుకునఁ వినమ్రభావమెలర్పఁ.
వినుమూ యించుక నామొర-జనుమా మధురాపురంబు సత్వరముగ నీ
వనుమా నావచనములుగ-ననుమాన మొకింత లేక యాతనిమ్రోలఁ.
సులలితముగ మదికెక్కగ-బలుకుము నాపలుకులెల్ల పరమాప్తుడవై
పలుకునో ! తిరస్కరించునో!-చెలువుండేమనునో ? యతని చిత్తముగనుమా.
హృదయగత భావముల వెల్వరించిచూప-వదనబింబమె యద్దమువంటిదౌను
గాన నీమాట లాలింపఁగడఁగినపుడు-యతని ముఖవైఖరులగాంచియరయుమయ్య.
చను మతనిగాంచు మతఁడే-యనువున నున్నాడొ కొంతయగయుడువలసీ
వను మొకటిరెండు మఱియేమనునో విని దెల్పుమయ్య యన్నియునాకుఁ.
వినునో నీపలుకుల నేమనునో ? ప్రతివచనములను నాలింపుము నా
మనవిని యావల దెల్పుము-మనుమనునో! జీవితాశ మానుమనెడినో

(సశేషము)

# వివాహ శాసనాలు ధిక్కరిస్తే శిక్ష, జరిమానాల విధింపు.



పెండ్లియీడు విషయంలో ఎవరు వివాహ శాసనాలను ధిక్కరించినా, వావి వరుసలు చూచుకోకుండా పెళ్లిళ్లు చేసుకున్నా, రక్షకుని అనుమతితో నిమిత్తం వున్నపట్ల వారి అనుమతిని పొందకుండా పెండ్లాడినా, వాటిని నేరాలక్రింద పరిగణించి శిక్షలు విధించాలని హిందూ వివాహం విడాకుల బిల్లు తాలూకు సెలెక్టు సంఘంవారు తమ నివేదికలో సూచించారు.

పెండ్లివారు రాకముందే తొందరపడి పెళ్లిచేసుకున్నవారికి 15 రోజుల కారాగారవాసంగాని, వెయ్యి రూపాయలదాకా జరిమానాగాని, లేకపోతే, ఈ రెండు శిక్షలను కలిపిగాని విధించవచ్చు; వావివరుసలు తప్పి పెండ్లిళ్లు చేసుకుంటే ఒక నెల కారాగారవాసంగాని, వెయ్యిరూపాయలుదాకా జరిమానా గాని, లేక రెండుగాని శిక్షలుగా విధించవచ్చు. రక్షకుని అనుమతి అవసరమైనచోట్ల, అట్టి అనుమతి పొందకుండా వివాహం ఆడితే వెయ్యిరూపాయలదాకా జరిమానా విధించవచ్చు.

ఎక్కడన్న విడాకులు ఇచ్చిన సందర్భాలువుంటే, ఆ వ్యాజ్యాలకు సంబంధించిన న్యాయస్థానం కోర్టువారి అనుమతితో మాత్రమే ప్రకటించడానికి వీలు అవుతుంది. అట్లా ఆ అనుమతి లేకుండా ప్రకటిస్తే, అది నేరం. ఈ నేరాన్ని వెయ్యిరూపాయలదాకా జరిమానా విధించి, శిక్షించవచ్చు.

ఈ చట్టం అమలులోనికి రాకముందు చట్ట విరుద్ధంగా వివాహాలు జరిగివుంటే, వాటిని సక్రమం చేసుకోడానికి అసలు బిల్లులోనే కొంత కాలవ్యవధి నిర్ణయింపబడివుంది. అసలు బిల్లులో ఆ వ్యవధి ఒక సంవత్సరంగా వుంది. ఇప్పుడు వీరు దాన్ని 2 సంవత్సరాలకు పొడిగించారు.

విడాకుల విషయంలో "రంకుతనం" చెయ్యడమే కారణంగా వీరు అంగీకరించలేదు. భార్యాభర్తలలో ఎవరు ఈ రంకుతనానికి పాల్పడి అట్లుదాన్ని సాగిస్తూ వుండటంను కారణంగా దిద్దారు. ఇది కాక ఇంకో రెండు కొత్త అంశాలనుగూడ ఈ విడాకుల అంశానికి చేర్చారు. - (1) ఇద్దరులో ఎవరుగాని సన్యాసం పుచ్చుకోవడం, (2) భర్త ఆచరించే కొన్నికొన్ని జుగుప్సాకరమైన పనులు.

విడాకులు ఇచ్చివేసిన తర్వాత మళ్ళీ పెళ్ళి చేసుకోవాలంటే మధ్య ఎంతకాలం వ్యవధి వుండాలన్న విషయంలో గూడా అసలు బిల్లుకు, వీరి సిఫార్సులకు తేడావచ్చింది. వీరు ఆ వ్యవధి ఒక్క సంవత్సర ప్రమాణంలో వుండటం తొందరపాటుకు దారితీయుదన్నారు. అందువల్ల బిల్లులో ఆ విధంగా మార్పు చేయబడింది. చట్ట విరుద్ధమైనట్టివీన్ని, చట్ట విరుద్ధం అయ్యేటటువంటివీన్ని వివాహాలు జరిగివుండి, అందువల్ల ఆ దంపతులకు పిల్లలు పుట్టివుంటే ఆ సంతానం చట్ట విరుద్ధం సంతానం కాదు. సక్రమం సంతానంలాగనే చట్టం వారిని పరిగణిస్తున్నదిగాని, వారికి తల్లిదండ్రుల స్వార్జితంలోతప్ప ఇతర విధమైన ఆస్తులలో భాగం వుండదు.

ప్రత్యేక వివాహాల బిల్లులోవున్నట్లే ఈ బిల్లులో గూడా వ్యవహారాలుముదిరి న్యాయస్థానందాకాపోతే, న్యాయస్థానంవారు చట్టం ప్రకారం వ్యవహారాన్ని తేల్చేముందు ఇరువర్గాలవారి మధ్య రాజీకి గట్టిగా ప్రయత్నం చేయవలసివుంటుంది. ఈ రాజీ ప్రయత్నం న్యాయస్థానంవారి బాధ్యతగా ఆ బిల్లులోలాగే, ఈ బిల్లులోగూడా పేర్కొనబడివుంది.

'ఆంధ్ర పత్రిక'



# తల్లి తిరిగి వచ్చిందా!

మూలం: రమణలాల్ దేశాయి    అనుకరణ : 'అర్జునుడు'

అతనిపేరు ఆనంద్. అతడు మంచి అందమైన వాడు. అతనియొక్క దయానురాగాలకు, ఉల్లాసానికి తగినట్లుగా అతనికాపేరు ఒప్పింది.

అయితే ఆనంద్ మాత్రం అంతగా అదృష్టజాతకుడు గాడు! అతని నాలుగవఏటే తల్లి చనిపోయింది. అప్పటి ఆనంద్ అందరిని అడిగేది ఒకే ఒక ప్రశ్న — "మాఅమ్మ ఎక్కడ? అని! ప్రతిసారి అతనికి వివిధ రకములైన సమాధానాలు వచ్చేవి! కొందరు స్వర్గానికి వెళ్ళిందని, మామగారింటికి వెళ్ళిందని అనేక విధాలుగా చెప్పేవారు. కాని యింటినౌకరుమటుకు "అమ్మ చనిపోయిందిబాబూ!" అని చెప్పేవాడు. ఆ మాటకు ఆనంద్ ఆశ్చర్యంగా "అరే! ఆమె చనిపోతేపోయింది! నన్ను తీసుకొని వెళ్లకుండా వంటరిగా వెళ్లిందే!" అని అమాయకంగా భోరున ఏడ్చేవాడు.

ఒక సంవత్సరానికి ఆనంద్ పాత ప్రశ్నను వదలి "తిరిగి ఎప్పుడు వస్తుంది — వస్తుందా?" అనే క్రొత్త ప్రశ్నలు వేయసాగాడు.

"వస్తుంది! నీవు మంచిమంచి ఆటలాడుకుంటూ వుంటే" అని సమాధానపరుస్తూ యుండేవారు.

ఆటలంటే ఆనంద్ మిక్కిలి సంబరపడేవాడు. కొన్ని దినాలవరకు అమిత ఉత్సాహంతోనే గడిపాడు. కాని అతని ఉత్సాహం కాలక్రమేణ క్షీణించిపోయింది. తిరిగి తల్లినిగూర్చే అడగడం మొదలుబెట్టాడు. ఆనంద్‌కు వచ్చే సమాధానాలు వినేటప్పటికి అతనికి ఒక విధమైన ఆలోచన కలిగేది. "నేను అమ్మవద్దకు వెళ్ళకుండా వీళ్ళంతా ఏదో కుట్రపన్నారు" అనుకొన్నాడు. రాత్రులందు నిద్రలో "అమ్మా! అమ్మా!" అని కలవరించేవాడు. యిది చాలా కష్టంగావుండేది తండ్రికి!

5 సంవత్సరములు గడిచి ఆరోసంవత్సరం ఆనంద్ జీవితంలో ప్రవేశించింది! ఆనంద్ ఒకదినం ఉదయం నిద్రలేచేసరికి మంచి సౌందర్యవతియైన అపరిచిత యువతి తమ యింటికివచ్చి వుండడం గమనించాడు. ఇంతకుముందు వాళ్ళ యింటికి వచ్చిన అతిథులలోని స్త్రీలను తన తల్లేమో అని వారివద్దకు వెళ్ళి కాళ్ళావేళ్ళాపడి వుండమని బ్రతిమాలేవాడు అమాయికంగా! కాని వాళ్లు ఎందుకుంటారు! కొన్ని దినాలకు తిరిగి వెళ్లిపోయేవారు.

"ఈనాడు వచ్చిన యీమెగూడా ఆ విధంగానే వెళ్లిపోయేదిలే" అనుకొన్నాడు ఆనంద్. కాని విశేషం ఏమిటంటే - ఆ వచ్చి వెళ్ళిపోయినవారందరి కంటె ఆ నూతన యువతి ఆనంద్‌ను ఎంతో ఆప్యాయతతో చూడసాగింది.! ఆనంద్‌కు మంచి దుస్తులు తొడిగి, ఆడుకొనుటకు బొమ్మలుయిచ్చేది. ఆనంద్ ఆమె ఎక్కువ సామానులతో వచ్చివుండడం చూచి ఆమె ఎక్కడికి వెళ్ళదని నిశ్చయించుకొన్నాడు. కాని ఆరాటంతో, వుండబట్టలేక "నీవు యిక్కడ వుంటావా? లేక వెళ్ళిపోతావా" అని అడిగాడు.

"నీకు ఏవిధంగాచేస్తే మంచిది? వుండమంటావా వెళ్ళి పొమ్మంటావా?" అని తిరుగు ప్రశ్న వేసింది ఆ యువతి.

"వుండిపో! పరవాలేదులే" అన్నాడు ఆనంద్. అయినా ఆమె అంత చనువుగా ప్రేమిస్తూవుండడం అతనిని ఆశ్చర్యపరచింది. అంతేకాదు ఆనంద్‌కు ఆమె అన్నంకలిపి లాలిస్తూ తినిపించేది. యీ విషయాలన్నింటినీ చూచేసరికి ఆనంద్‌కు మరీ ఆశ్చర్యంవేసింది! ఆమె ఎవరు?

తండ్రికూడ ఆమెను ప్రేమగా చూడడం అతని కంటబడింది. ఆమెమటుకు తండ్రివద్ద సిగ్గుతో తల

ఎత్తక నమ్రతగా మాట్లాడుతూ వుండడం చూశాడు. ఆమె ఎర్రటి పెదవులపై మిసిమి నవ్వులు ఎల్లప్పుడు తాండవించేవి.

ఒకరోజు రాత్రి ఆమె ఆనంద్‌కు అన్నంబెట్టి పరుండబెట్టే సమయమున ఆనంద్ తనకు యింతవరకు సంశయంగావున్న సందేహాలను తీర్చుకోదలచాడు!

"నువ్వు నాకేమైనా బంధువా? ఏ విధంగా?" అని అడిగాడు.

కొన్ని క్షణాలు ఆమె నిశ్చలంగావుండిపోయింది. కడకు జాలిగొలిపే స్వరంతో "నేను నీకు తల్లిని" అంది.

"మా అమ్మవా" అని ఆనంద్, ఎగిరి ఆమె మెడలో చేతులు వేసి వ్రేలాడవలెననుకొన్నాడు. కాని అతని శక్తిని ఏదో అడ్డుపడ్డచినట్లు అలా చేయలేకపోయాడు. ఆనంద్ తన చిన్ని చేతులలోనికి ఆమె చేతులను తీసుకొని మళ్లీ "నిజంగా, మా అమ్మవేనా!" అని అడిగాడు.

"అవును! నేను నిజంగా మీ తల్లినే!"

"అలాఅయితే నీవు ఎందుకు అంత దూరంగా వుంటావు? రా! దగ్గరగారావేం!"

"లేదు యికముందు ఆ విధంగా వుండనులే!

"నేను నిన్ను ఏమని పిలవాలి?"

"అది నీకే విడిచిపెట్టా" అంది ఆమె.

ఆమెకు అంత చిన్నవయస్సులో తన్ను "తల్లి" అని పిలిపించుకొనుటకు సిగ్గు అనిపించింది. అందువల్ల ఆనంద్ నిస్పృహచెందాడు. ఆమె తల్లికాదని నిశ్చయించుకొని నిద్రబోయాడు.

♦ ♦ ♦

ఆమె ఆనంద్ పినతల్లి. ఆనంద్ తండ్రి పిల్లవాని సంరక్షణభారానికి రెండవవివాహం చేసుకొన్నాడు. ఆమె ఆ యింటికి వచ్చింది లగాయితు సవతి తల్లి అయినా మాతృదేవికన్న మిన్నగా ఆనంద్ సంరక్షణ భారం తనపై వేసుకొంది. ఆనందును ఉదయం లేపుటతో ఆమె కార్యక్రమం ప్రారంభమయ్యేది. మంచి భోజనంపెట్టి, తలదువ్వి, దుస్తులువేసి బడికిపంపేది. ఆమె చెప్పిన ప్రతి విషయం ఆనంద్ తూ_చా తప్పకవిని, అనుగుణ్యంగా నడిచేవాడు. కాని అతనికి ఎప్పుడూ ఉత్సాహం వుండేదిగాదు. అతనిని పట్టుకున్నదల్లా - "ఈమె తల్లా? లేక ఏ టీచరన్నా నా!" అని! అతని నిశ్చయం 'ఆమె తల్లిమటుకు కాదని.' అయినా ఆనంద్ శ్రద్ధగా ఆమె చెప్పినట్లు నడిచేవాడు. ప్రవాహంలాగా మాట్లాడే అతని మాటలు క్రమంగా అనకట్ట కట్టబడినట్లు నిశ్శబ్దంగా మారిపోయునవి. ప్రతిదినం స్కూలుకు వెళ్ళి వచ్చినా దినదినం దేహారోగ్యం క్షీణించిపోసాగింది. ఆనంద్ పినతల్లికి యీ విషయం మిక్కిలి ఆందోళన కలిగించింది. భర్తతోచెప్పి ఆనంద్‌ను వైద్యుని సలహాకు పంపింది. వైద్యుడు పరీక్షచేసి మందు వ్రాసియిచ్చాడు. కాని మందు తీసుకొనడానికి ఆనంద్ ఎంతో గలభా చేసేవాడు. ఆనంద్‌కు పినతల్లి బలవంతంగా మందు త్రాగించడంలేదు. రోగంతో బాధైనా పడవచ్చును గాని ఆమె చేతిమందు త్రాగగూడదు అనిపించింది. ఆమెను ఆనంద్ సరిగా అర్థం చేసుకోలేకపోయాడు.

"ఆనంద్ యీమందు తీసుకో" అంది ఆమె.

"ఊ! హూ! నేను తీసుకోను"

"అదినాకు తెలుసులే! నీవు తప్పక తీసుకోవాలి!"

"ఎందుకు"

"డాక్టర్ చెప్పాడు"

"అతను చెప్పిందల్లా వినాలా?"

"అవును"

"అలాగా! ప్రతివాళ్లు చెప్పింది నేను వినవలసిందేనా?"

"లేదు! నీకంటే పెద్దవాళ్లు చెప్పింది వినాలి."

"నేను ఆవిధంగా చేయకుంటే!"

"జబ్బు ఎక్కువౌతుంది! అసలే జ్వరంతో నున్నావు"

"నేను మందు తీసుకోకపోతే!?"

"చనిపోతావు"

ఆమె ఎప్పుడు అధికారంగా ఉత్తరవు చేయ లేదు! బిడ్డను ఏ విధంగా లాలించి నచ్చజెప్పి సర్ది పుచ్చడమనేది ఆమెకు బాగా తెలుసు. ఆనంద్‌కు మటుకు ఆమె తన్ను శాశిస్తున్నట్లు అనిపించేది.

"నేను చనిపోతే వీళ్ళకేమ్? మా అమ్మగూడ చనిపోయిందని చెప్పతారే!" అని అనుకొన్నాడు. ఆనంద్ తను చనిపోవడమే తల్లినిచేరుటకు సరిఅయిన మార్గం అని నిశ్చయించుకొన్నాడు.

మరుసటి ఉదయం భోజనంవద్ద ఆనంద్‌కు జ్వరం వచ్చినట్లు పినతల్లి కనిపెట్టింది. ఆనంద్ శరీరంపై చేయివేసి చూచింది. శరీరం సలసల కాగిపోతుంది. "ఆనంద్ నీవు వెళ్ళి పడుకో — నేవెళ్ళి డాక్టరుకు కబురుచేస్తా" అంది.

"అరే! నా స్కూలు సంగతి?" అన్నాడు ఆనంద్. ఈ మాటలకు ఆమె హృదయం ద్రవించి పోయింది. "తనయొక్క మాటలకు ఆనంద్ బానిసగా మారిపోయాడే" అని విచారపడింది. "పోతే పోయింది — ఒకరోజు! నీవువెళ్లనక్కరలేదు!" అని వెళ్ళిపోయింది.

♦ ♦ ♦

డాక్టరువచ్చి ఆనంద్‌ను పరీక్షచేసి మందు యిచ్చి వెళ్ళాడు. సాయంకాలానికి ఆనంద్‌కు మరీ జ్వరం హెచ్చి జ్వరంలో కలవరింతలు మొదలెట్టాడు. పినతల్లి ఆనంద్ పరిస్థితి చూచి ఆ రోజంతా భోజనం మానుకొని రోగివద్దయుండింది. ఆనంద్ తండ్రి పినతల్లి ఆనంద్‌కు చేసే పరిచర్యలకు సంతృప్తి చెందాడు.

కలవరింతలలో ఆనంద్ "అమ్మా! అమ్మా!" అనేమాట తప్ప యింకేంలేదు. ఆ మాటలకు పినతల్లి హృదయం ప్రత్యుత్తరంగా "అబ్బాయ్! ఆనంద్" అనాలని అనుకొనేది. కాని సిగ్గువల్ల అలా చేయలేక పోయేది.

"ఆనంద్! అలా కలవరిస్తున్నావేం! కల వచ్చిందా!" అంది.

ఆనంద్ కళ్లుతెరచి పినతల్లి తనవద్ద వుండడం చూచి "నిన్నుకాదు! మా అమ్మను" అని మళ్లీ కళ్లు మూసుకొన్నాడు.

"ఆనంద్! నీవు నన్నే పిలిచావు!"

"కాదు — మా నిజమైన తల్లిని! ఆమెకావాలి!" అన్నాడు.

ఈ మాటలు ఆమెను ఎంతో చలింపజేశాయి. ఆమె బాధిత హృదయానికి మరికొంత ఆజ్యం పోసినట్లయింది. ఆమె హృదయం ఆ మాటలతో తల్లడిల్లిపోయింది.

"తను అతని తల్లిగా మెలగలేక యిన్నిరోజులు ఏదో అపరిచిత యువతిలాగే వుండిపోయి, ద్రోహం చేశానా" ననుకొంది.

"ఆనంద్! నేను మీ తల్లిని కాదూ!"

"కాదు! నీవు చాలా కఠినంగా ప్రవర్తిస్తావు! దగ్గరకుపిలిచి లాలించావా? ఎప్పుడైనా నన్ను ఎత్తుకు తిరిగావా?" అన్నాడు ఆనంద్ కన్ను తెరవకనే!

"లేదు పాపా! — ఆ విధంగా యికవుండనులే! నిన్ను తప్పక ఎత్తుకుంటా -"

"మా అమ్మ చనిపోయింది? నీవేనా ఆమెవు?"

"అవును! నన్ను గుర్తుపట్టలా!"

"లేదు! నీవు ఎట్లా — ఎందుకు తిరిగివచ్చావ్!"

"అదేం ప్రశ్న! నా చిట్టితండ్రీ! — నేనెవరి కోసంవస్తా! నీకోసమే!" అని ఆమె ఆనంద్‌ను తన చేతులలోనికి తీసుకొని జ్వరంతో వుండే అతని ముఖంపై చల్లని ముద్దులను కురిపించింది. అతని

చెంతనే పరుండి లాలించింది. అప్పటికి ఆనంద్‌కు ఆమె తన తల్లిఅనే అభిప్రాయం ఏర్పడింది. అందుకు నిదర్శనం అంతకుపూర్వం మాతృహృదయంతో లాలించి దగ్గరకుతీయని పినతల్లియొక్క ఆ రోజు ప్రవర్తనే.

ఆనంద్ తన చిన్ని చేతులను ఆమె మెడకుచుట్టి హాయిగా ఒళ్ళో పరుండిపోయాడు.

పినతల్లి అయినా బిడ్డ సుఖంకోసం అబద్ధంచెప్పి ఆమె అతనితల్లి స్థానాన్ని ఆక్రమించింది.

— —(0)— —

క్రిక్కిరిసియున్న బస్సులోని ఒక ప్రయాణీకుడు "కండక్టర్! ఊపిరి పీల్చడానికి, వదలడానికికూడ అవకాశంలేకుండాయుంది - సర్దుబాటుచేద్దూ!"

"అలాగే. మీలో గాలిపీల్చడం, వదలడం ఒకరి తర్వాత మరొకరు జరుపుతూంటే సర్దుబాటైపోతుంది"

పర్ల్ బార్లీ అనే ముందు
రాబిన్సన్స్
అనండి
అన్నిటికీ
అత్యుత్తమమైనది
ROBINSON'S
PEARL
BARLEY
REGD
అట్లాంటిస్ (ఈస్ట్) లిడ్.,
పోస్ట్ బాక్సు 664, కలకత్త.
ARPX 471

# నల్లతంగాళ్ కథ

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు

ఈ జంగంకథ * పూర్తి పేరులోనే అచ్చు తప్పు ఉన్నాయి. నల్లతంగాళ్‌కు సంస్కృతం సత్సహోదరి. నల్లతంగాళ్ అరవపేరు. నల్ల అంటే మంచి లేక సత్ అనీ; తంగాళ్ అంటే చెల్లెలు లేక సహోదరి అని అర్థాలు. కాబట్టి ఈ కథకి సత్సహోదరి అని మరొకపేరు. సత్సహోదరి అనడానికి ముద్రాపకులు పద్సహోదరి అని తప్పుగా అచ్చు వేసేరు. ఈ కథపేరు సులువుగా అర్థంకాదని సంస్కృతనామ మొకటి ఏర్పరిచేరు. రచన పూర్తిగా గేయం; వచనం లేదు. పాండ్యరాజ కుటుంబంలోని కథ. ఈ పదానికి చిత్తూరు, ఉత్తర ఆర్కాటు జిల్లాల్లో జనత అధికం.

## స్థలం – చరిత్ర – కవి

ఈ కథ అరవదేశానికి పాండ్య రాజ్యానికి సంబంధించినది. అప్పటి రాజుపేరు రామలింగంట. కొడుకుపేరు నల్లతంబి. కూతురుపేరు నల్లతంగాళ్. ఈ రెండూ పేర్లు అవడానికి వీలులేదు. నల్లతంగాళ్ అంటే అర్థం పైనచెప్పేను. నల్లతంబి అంటే మంచి తమ్ముడు అని అర్థం. నల్లతంబి కుంతలరాజు కుమార్తెయైన మూాదేవిని పెండ్లాడేడు. దానివల్ల కుటుంబం అంతమయింది.

ఇదంతా అరవదేశానికి సంబంధించిన కథ కదా! ఇది తెలుగుదేశంలో ఎట్లు వ్యాప్తమయింది? ఈ కథ తెలుగుదేశ మంతటిలోనుగాక అరవదేశపు ఉత్తరపు సరిహద్దులలోనున్న జిల్లాలవారికే తెలుసు. అందులో అసహజమేమీ లేదు. దీనికి మరికొన్ని నిదర్శనాలు చూపించవచ్చు. శేలము కలహాపవాద విమోచనము § అను చిన్న పద్యకావ్యాన్ని చిలంబు ఆదినారాయణప్పనాయుడు 1484 లో రచించేడు. దీనిలో శేలంలోని హిందూమహమ్మదీయ కలహం వర్ణించబడింది. ఘటన అక్కడిదయినా తెలుగు దేశంలోకూడ ఉత్తేజం కలిగించింది. అట్లే పాండ్య రాజుకథకూడ సరిహద్దులవారికి ఉత్తేజం కలిగించిందని చెప్పవచ్చు. లేక ఈ సరిహద్దు ప్రాంతంకూడ ఆ కాలంలో పాండ్యరాజు అధీనంలో తాత్కాలికంగా ఉండి ఉండవచ్చు. కృష్ణరాయలు కాలంలో మధుర సంపూర్ణంగా విజయనగర రాజ్యంలో చేరింది. మధుర, తంజావూరులలో జానపదసాహిత్యం రాజాస్థానాలలోనే పుట్టింది. ఈ జంగంకథ అప్పుడు బయలుదేరి ఉండరాదా? ఆనాడు ఘనులైన పాండ్యరాజు లెవరూ లేరు. ఘనులైన పాండ్యరాజుల కాలాన్ని గురించి - క్రీ. పూ. 543 నుండి యుండిన పాండ్యరాజ్యము క్రీ. శ. ఏడవ శతాబ్దమువరకు నుండెను. దీనితో మొదటివంశము అంతరించెను. వారిలో కూన్ అనురాజు ఆఖరివాడు ... తరువాతి పాండ్యరాజులకు శూద్ర స్త్రీ వలన బుట్టిన రాజులు నలుబదియొక్కమంది క్రీ. శ. 7 వ శతాబ్దమునుండి 11 వ శతాబ్దమువరకు రాజ్యము చేసిరి. కాని వారంత ప్రతిష్ఠకలిగియుండలేదు. వీరి కాలమున వీరి రాజ్యము తిన్నగా చోళరాజ్యములో గలిసెను. ♦ కృష్ణరాయల కాలంలోకూడ మధురను ఒక చిన్న పాండ్యరాజు పరిపాలిస్తూ వచ్చేడు. ఇతని

---

* నల్లతంగాళ్ కథను ఎస్. వి. గోపాల్ అండ్ కో మదరాసువారు 1952 లో ప్రకటించిన ప్రతి.

§ శేలము కలహాపవాద శిక్షావిమోచనము, రాజమహేంద్రవరంలో వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలో 1884 లో అచ్చయింది.

♦ కొమర్రాజు లక్ష్మణరావుగారి హిందూదేశకథా సంగ్రహము (హిందూ మహాయుగము) 232 వ పుటలో నున్నదాని సంగ్రహం తెలుపబడింది.

పేరు చంద్రశేఖర పాండ్యుడు. అట్లే అతివీర రామ పాండ్యుడు (క్రీ. శ. 1565 నుంచి 1610) మధురను పాలించినట్లు తెలుస్తూంది. ♦ కాని వీరు అస్వతంత్రులై, అప్రసిద్ధులై ఉన్నారు. కాబట్టి ఈ జంగంకథ ప్రసిద్ధులైన పాండ్యరాజులకు సంబంధించినది అని మాత్రం చెప్పగలము. కాలాన్ని గురించి అంతకంటె చెప్పలేము.

ఈ కథలో ప్రాచీనతను తెలిపే లక్షణాలు మరి కొన్ని ఉన్నాయి. దక్షిణహిందూదేశానికి మహమ్మదీయుల తాకిడి తగిలినప్పటినుంచి హిందూస్థానీ పదాలు జంగంకథలలోకి ప్రవేశించేయి. బాలనాగమ్మ (క్రీ. శ. 1350 ప్రాంతం) కథలోనె ఇట్టివి ఉన్నాయి. క్రీ. శ. 1592 ప్రాంతందైన బంగారు తిమ్మరాజుకథలో బోలెడన్ని ఉర్దూపదాలున్నాయి. అటువంటి సందర్భంలో నల్లతంగాళ్ కథలో ఉర్దూమాటలే కనబడవు? ఇది దీని ప్రాచీనతకు నిదర్శనం.

కథయొక్క చివరిభాగంలో నల్లతంగాళ్ పేరట చిన్నకోయిల కట్టించబడ్డదనీ, అందులో మూదేవి వేయించిన శాసనం ఉందని చెప్పబడింది. ఇది కవి కల్పన కాకుంటే దాని పరిశోధన అవసరం. కథాకాలంలో తాటాకుమీదే ఉత్తరాలు రాసేవారు. (పుట 17) ఈ గేయాన్ని తమిళసరిహద్దులలో నుండు కవి వ్రాయడంచేత ఆ సరిహద్దులలోని మాటలు కనబడుతున్నాయి. అతనిపేరు మాత్రం తెలియదు. నల్లతంగాళ్ కథవంటిది అరవంలోకూడ ఉందట! పరిశోధన అవసరం.

## సుఖాంత కథ

ఇది సుఖాంతకథా లేక దుఃఖాంత కథా? ఈ కథ పొడుగునా కరుణ రసముంది. చనిపోయిన వారిని చివరకు పార్వతీ పరమేశ్వరులు బ్రతికిస్తారు. ఈ అంశం అనేక నోముల కథలలో వస్తుంది. కథ చివర అందరూ బ్రతుకుతారు. కొందరు స్వేచ్ఛగా కైలాసానికి పోతారు. కాబట్టి ఇది సుఖాంత కథ.

## సాంఘిక స్థితి

ఈ కథనుంచి ఆనాటి సాంఘిక జీవితం కొంచెంగా తెలుస్తూంది. క్షత్రియులలో రాజమర్యాదలు, వేట, రాణులలోని మాత్సర్యం మొదలైనవి చెప్పబడ్డాయి.

నల్లతంబి తన కొడుక్కి వివాహం చేయబోతూ కీలు పందిరిని వేయించేడు. తన భార్యతాలూకు బంధువులను దానికింద కూర్చుండజేసేడు. కీలుమీటగా దానికింద ఉన్నవారంతా మరణించేరు. ఇట్టి సంఘటన దేశచరిత్రలో ఒకటి జరిగింది. ఢిల్లీ సుల్తాన్ అయిన గయాసుద్దీన్ (క్రీ. శ. 1321 – 25) బెంగాల్ దేశానికివెళ్ళి అక్కడ వారిని, తిరుహూత్ ప్రదేశాన్ని లొంగదీసి, తిరిగి ఢిల్లీకి వచ్చేడు. అతని కుమారుడైన మహమ్మద్ జునాఖాన్ తండ్రికి స్వాగతమీయడానికి ఒక కర్ర పందిరిని ఏర్పాటుచేసేడు. దానిక్రింద గయాసుద్దీన్ కూర్చుండగా ఆ పందిరిని కూలిపోజేసేడు. గయాసుద్దీన్ దానికింద పడి మరణించేడు. జునాఖాన్ 'మహమద్ బీన్ తుగ్లక్' అనుపేరున (క్రీ. శ. 1325 - 51) ఢిల్లీని పాలించేడు.*

ఆనాటి సాంఘిక జీవనంలో అమలులో ఉన్న కొన్నిశిక్షలు: నాలుకకోయ్యడం, కొప్పుకోయ్యడం, స్త్రీనైనాసరే జిల్లేడుహారం మెళ్ళోవేసి గాడిదమీద ఎక్కించి ఊరేగించడం. పాండ్యరాజు అటువంటి శిక్ష దుర్మార్గురాలైన తన భార్యకే వేసేడు.

అపశకునాలు :- పడుచుచేతిలో అగ్ని పట్టుకు రావడం, అట్లే విధవ తెచ్చినా తప్పే: చాకలి

♦ తంజాపురాంధ్ర నాయకరాజు చరిత్రము (కురుగంటి సీతారామయ్యగారు రచించినది. పుటలు 60,185.)

* Indian History for matriculation by K. P. Mitra P. 103.

చలువగుడ్డలు తేవడం, తెలిసినవాడు నూనెకుండ తేవడం, బాపడు రావడం, పిల్లి అరుస్తూ అడ్డం రావడం, తొండ అడ్డం రావడం.

### పాత్ర పోషణ

ఈ గేయంలో పాత్రపోషణ చక్కగా ఉంది. దుర్మార్గురాలైన మూదేవి అంటే కవికి అసహ్యం. కాబట్టి దానిపేరు వచ్చినప్పుడెల్లా 'మూదేవిఛండాలి' అంటూంటాడు. నల్లతంబి తన భార్యపక్షం వహించక, న్యాయమాలోచించి చెల్లెలి పక్షాన ఉంటాడు.

### అతిలోక విషయాలు

కథా కల్పనలో కొన్ని అతిలోక విషయాలున్నాయి. నల్లతంగాళ్ పతివ్రత. పతివ్రతలకు కొంత అతిలోకశక్తి వున్నట్లు మన గ్రంథాలలో చెప్పబడింది. నల్లతంగాళ్‌లో కూడ అటువంటి విచిత్రాలున్నాయి. ఆమె తిట్టగా మూసిఉన్న తలుపులు విడిపోయేయి; అగ్ని రగులుకొంది; మాంగల్యాన్ని క్రిందపెట్టి పెద్దరాయిగా చేసింది.

### కల్పనలో లోపాలు

కథా కల్పనలో కొన్ని లోపాలు కనబడుతున్నాయి. నల్లతంబికి తన చెల్లెలు అడవిలో దొరికిందట! తాను పెద్ద పరివారంతో ఉండి నల్లతంబి చెల్లెలిని ఒక్కర్తెను అడవిలోంచి ఇంటికి పంపించాడు. మధురకి కాశీకి ఆరు లేక పన్నెండు యోజనాల దూరమట! అంకెలలో అసహజత్వముంది. కోట్లు, లక్షలు సులువుగా వస్తూంటాయి. ఇట్టి సంఖ్యాలోపం భాస్కర రామాయణంలో కూడ విశేషంగా ఉంది.

### రసములు – రచన – భాష.

ఈ కథ జనత కలది. మనస్సుకు తగిలే బాధలు, విచారం, ధర్మవిజయం, మహిమ మొదలైనవి అధికంగా ఉన్నాయి.

అడవిలో నల్లతంగాళ్ బిడ్డల స్థితిచూసి –
'ఆపసిబాల లేడ్పుజూచి యడవియంత యేడ్వసాగె,
కూన లేడ్పులజూచి కొండలంత యేడ్వసాగె' (14)
మనస్సుకి నచ్చడంకోసం పునరుక్తి —

అడివిలో యేడ్చేడు అబల యెవరమ్మా నీవు
వనములో యేడ్చేడి వనిత యెవరమ్మా నీవు
ఒంటిగా యేడ్చేడు కారణమేమమ్మా నీకు
కాననమందేడ్చేడు కారణమేమమ్మా నీకు (16)

తిండిలేని బిడ్డలని బిడ్డలస్థితిని కవి ఎంత కరుణగా తెలియజేసేడో చూడండి :—

అన్నమని చెప్పి బాలలాకలితో ఏడ్చేదరు
పాలు అన్నముతిన బాలలేడ్చేదరుగా
నీరు నీరనిచెప్పి నిక్కి నిలచిఏడ్చేదరు
అన్న మన్నమనిచెప్పి అలసి ఏడ్చేదరు
ఆకలి తీరుటకు ఆదరువు చెప్పుమమ్మా
మనసు కరుగలేదో మహాపాపి మూదేవి
నన్ను చూడ కోపమైన బాలలను చూడుమమ్మా
(పుట 21)

నల్లతంగ తాను రాచబిడ్డయియుండి కష్టం చేసుకోలేనని తెల్పేమాటలు —

పూలుపెట్టు తల పూర్వకర్మమో గడ్డిమోయ
వాసన తలయందు కటమోయ కారణమో
గంధమెత్తు చేతులతో పేడతట్ట కారణమో
కుంకుమెత్తు చేతులతో కూలిచేయ విధివశమో (11)

ఈ కథా కల్పనలో ఐక్యత ఉంది కథంతా పదిహేను సంవత్సరాలలో జరిగి ఉంటుంది.

కవి పదరచనకుండే లక్షణాలు చక్కగా పాటించేడు.

దీనిలో ప్రకృతి వర్ణనలు చక్కగా ఉన్నాయి. మధురచుట్టూ ఉన్న తోటలు, అడవులను చక్కగా వర్ణించేడు. నాటకమప్పటి దేశస్థితిని మాటలలో ప్రతిబింబింపజేసేడు.

(667 పేజి చూడుడు)

# త్యాగమూర్తి

కుమారి ఎన్. సులోచన

—o—

పౌర్ణమికిముందు చతుర్దశి. రాత్రి చాలా గడచి ఉంటుంది. పంజాబ్ ప్రాంతంలో ప్రస్తుతం "సియాల్ కోట్" అనబడే శాఖలానగరంలో హూణ చక్రవర్తి మిహిరకులుని అంతఃపురంలో ఒక విశాలమైనగది. అనేక విధాలుగా అలంకరించబడిన ఆగదిలో జగజ్జ్యోతుల్లా ప్రకాశించే దీపాలు రంగు రంగుల కాంతులు వెదజల్లుతున్నాయి.

ఒక ప్రక్కన నలుగురైదుగురు బానిస యువతులు వాద్య సంగీతంతో మిహిరకులుని హృత్తంత్రులు మీటుతున్నారు. గది మధ్య తెల్లని పాలరాతితో కట్టబడిన యెత్తైన పీఠం. దానిపై నాట్యం చేస్తోంది ఒక అందగత్తె. ఇంకొకప్రక్క మెత్తని పట్టుదిండ్లపై ఆరోహణించిన మిహిరకులుడు, బానిస యువతి స్వర్ణపాత్రలో పోసియిచ్చిన మధువును కొద్ది కొద్దిగా త్రాగుతూ తన యెదుట జరుగుతున్న నాట్యాన్ని చూస్తున్నాడు.

చూచినవారి హృదయాల్లో తుఫాను రేగించగల్గినది హూణ చక్రవర్తి రూపం. అంతగా పొడుగైనవాడు కాకపోయినా, అతి విశాలమైన భుజాలు అతని అసాధారణమైన బలాన్ని చాటుతున్నట్లున్నాయి. మృదువైన తోలుతో తయారుచేయబడిన వస్త్రాలు ధరించి ఉన్నాడు. శుభ్రంగా తోమిఉంచిన రాగిపాత్రలాంటి శరీరఛాయ, చప్పిడి ముక్కువల్ల మరింత వికారంగా కనబడే గుండ్రటి, అతివిశాలమైన ముఖం, బట్టతలా, సన్నటి గడ్డం, మెడదాకా వ్రేళ్లాడే నల్లటి మీసాల్ని మరింత గాత్రంగా కనిపించేటట్లు చేస్తున్నాయి. అన్నిటికంటే ఆ కళ్లు - ఆహా! లోతుకుపోయిన ఆ చిన్ని కళ్లల్లోని భయంకరమైన క్రౌర్యం! కాని కొండ శిఖరాలపైనుంచి ఏనుగులను క్రిందికి దొర్లించి, మరణ వేదనా భరితమైన వాటి భయంకర గర్జనను విని సంతోషించే మిహిరకులునికి అటువంటి కళ్లుండటం ఆశ్చర్యపడవలసిన విషయంమాత్రం కాదు.

"శహబాష్ వహవ్వా! బాగుంది! బాగుంది. ఇంకా కొంచెంసేపు ఆడు చూద్దాం" అని తన కీచు గొంతుకతో సంతోషారవంచేశాడు. పలుసార్లు తొడలు చరుచుకున్నాడు.

పాలరాతి పీఠంమీద నాట్యంచేసే అందగత్తె చిత్రలేఖ. మిహిరకులుడు ఆమె నాట్యాన్ని కళా దృష్టితోనే చూస్తున్నాడనటానికి వీలులేదు. నాట్యకత్తె శరీర సౌందర్యాన్నే అతని అనిమేష నేత్రాలు పరికిస్తున్నాయి. పోతపోసిన కంచు విగ్రహంలా నిగనిగలాడే ఆమె అంగసౌష్టవం అతని కామోద్రేకాన్ని క్షణక్షణం అధికంచేస్తోంది.

చిత్రలేఖ ఉజ్జయినినుండి శాఖలా నగరానికివచ్చి ఒక్క నెలే కావస్తోంది. ఆకొద్దికాలంలోనే మిహిరకులుని దృష్టిని పూర్తిగా ఆకర్షించింది. స్త్రీ అంటేనే మోహపరవశమైపోయే హూణ చక్రవర్తి చిత్రలేఖను చూడగానే మతి చెడిపోయినట్లయిపోయాడు. ఎన్నెన్నో ఆశలు చూపాడు ఆమెను తన వశంచేసుకోవాలని. కాని చిత్రలేఖ ఏవేవో కారణాలు కల్పించి అతణ్ణి తప్పించుకుంటూ వచ్చింది. చివరికి పౌర్ణమిదాటిన మరురోజు అతని వశమవడానికి ఒప్పుకుంది. ఆ గడువు దాటటానికి ఇంకా ఒక్క రోజే మిగిలింది. ఒకరాత్రి, ఒకపగలు, దాటేలోగా తన ఉద్రేకాన్ని ఆపుకోలేకపోతున్నాడు.

తన నేర్పరితనం అంతా వెల్లడిచేస్తూ అత్యాశ్చర్యకరంగా నాట్యంచేస్తోంది చిత్రలేఖ. మిహిరకులుడు ఉన్నట్టుండి తనచేతిలోని మధుపాత్రను దూరంగా పారవేసిలేచాడు. తూలుతూ చిత్రలేఖను సమీపించాడు. రెండుచేతులూ జాపి, బొంగరంలా తిరుగు

తుండే ఆమెను, ఆపి పట్టుకున్నాడు. హఠాత్తుగా అతని చేతుల్లో చిక్కిపోయిన చిత్రలేఖ ముఖాన భయమూ, అసహ్యమూ ప్రతిఫలించాయి. కాని క్షణంలో ముఖభావం మార్చుకొని, పాములా మెలికలు తిరిగిపోయి పట్టు విడిపించుకుంది. చిరునవ్వు చిందుతూ "ఇంకా ఒక్కరోజేగా? ఓర్చుకోండి రాజా! ఎందుకంత తొందర?" అని మిహిరకులుని బుగ్గలు ముద్దుగా గిల్లి మాయమైంది. మిహిరకులుడు ఆమె వెళ్లినవేపే కొంతసేపు చూస్తూ నించొని, ఒక్క నిట్టూర్పు విడిచాడు. తర్వాత బానిస యువతులు ఇరుప్రక్కలా చేయూత నిస్తూండగా, తన మంచం వేపుకి నడిచాడు.

## ౨

పై ఘటన జరగటానికి రెండు నెలల క్రితం మాట - ఉజ్జయినిలో ఒక రోజు సాయం సమయాన మాళవదేశపురాజు యశోవర్మ తన ఆలోచనా మంటపంలో చేతులు వెనక్కి కట్టి పచార్లు చేస్తున్నాడు అటూ ఇటూ. కళకళలాడే అతని ముఖాన్ని చింతా రేఖలు మలినం చేస్తున్నాయి. ఏదో అతిముఖ్య విషయాన్ని గురించి దీర్ఘాలోచన జరుగుతున్నదని చూడగానే చెప్పవచ్చు.

మహారాజుకి కొద్ది దూరంలో అతణ్ణే చూస్తూ నిల్చున్నది రాజమాత శ్రీదేవి. పచార్లు చేస్తుండిన యశోవర్మ తన తల్లి యెదుటికివచ్చి ఆగాడు.

"అమ్మా! మీ మాటలు విచిత్రంగా ఉన్నాయి! నా సైన్యబలమెక్కడ, హూణుల బలమెక్కడ! తన ఒక్క గుర్రపు దళంతో మన సైన్యం అంతటినీ ఒకేరోజులో హతమార్చి ధ్వంసం చేయగల శక్తికలవాడుకదా మిహిరకులుడు. ఇవన్నీ ఆలోచించకుండా నన్ను శాకలానగరంపై దండెత్తమంటున్నావే. సాధ్యమవుతుందా అమ్మా?" అన్నాడు.

"బిడ్డా! సూర్యవంశంలో పుట్టిన నీవేనా ఇలా పిరికి పందలా మాట్లాడుతున్నావు? నా చెవులను నమ్మలేకపోతున్నాను. కుట్రచేసి నీ తండ్రిగారిని చెరపట్టి, చిత్రవధ చేసిన క్రూరుడు, ఆ హూణునిపై పగ సాధించడం నీ ముఖ్య కర్తవ్యమన్న మాట మరిచావా? మనసు చలించకు నాయనా! మొదట పాటలీపుత్రంలో భానుగుప్తునికి ఒక సందేశం పంపు. అతని సహాయం దొరికేటట్లు చూడు. తర్వాత నీవు సైన్యం పోగుచేసుకు బయలుదేరావంటే హూణ సామ్రాజ్యం చుట్టుప్రక్కల ఉన్న సామంతరాజులుకూడా నీకు సాయపడతారు. ఆ దుర్గామతల్లి దయవల్ల నీకు జయం నిశ్చయంగా కలుగుతుంది." - భావావేశంచేత శ్రీదేవిగొంతు కంపించింది.

యశోవర్మ వంగి తన తల్లి పాదాలు స్పర్శించాడు. మహారాజుకు తన తల్లిపై యెక్కడలేని భక్తి. పైగా అనుభవశాలి. కాబట్టి తల్లితో కలిసి ఆలోచించకుండా ఏ పనీ తలపెట్టడు.

"అమ్మా! క్షమించండి. మీ ఆజ్ఞను శిరసావహించి నా ప్రాణాలనే అర్పించడానికికూడా నేను వెనకాడను. మీరు చెప్పినట్లు మగధకూ, ఇతర చోట్లకూ ఇప్పుడే వార్తలు పంపుతాను. కాని ఒక ముఖ్య విషయం - ఆరితేరిన గూఢచారి నెవరినైనా శాకలానగరానికి పంపి హూణుల సైనిక బలాన్నీ, ఇతర విషయాలను గురించిన ఆచూకీ తెలుసుకోవాలి. మిహిరకులుడు అమితంగా భోగభాగ్యాలలోనే మునిగి ఉన్నాడా అనే విషయం ముఖ్యంగా తెలుసుకోవాలి. అదే నిజమైతే హూణులపై దండెత్తడానికి ఇంతకంటే అనువైన సమయం దొరకదని నా నమ్మకం. ఈ విషయాలన్నీ తెలుసుకొని రావడానికి యోగ్యుడైనవాణ్ణి పంపాలి" అన్నాడు యశోవర్మ.

"నాయనా, ఆ విషయం నాకు వదిలిపెట్టు. నేనే చూసుకుంటాను" అని చెప్పి గదిలోంచి వెళ్ళిపోయింది శ్రీదేవి.

కొంతసేపట్లోనే చిత్రలేఖ రాజమాత ప్రత్యేక మందిరంలో ప్రవేశించింది. నాట్యరాణి చిత్రలేఖను ఎరుగనివారు మాళవరాజ్యంలో ఎవరూ లేరనే చెప్పవచ్చు. ఉజ్జయినిలోని మహాదుర్గ దేవాలయంలో ఆమె ఒక దేవదాసి. పాతికేళ్లు నిండని ఆ యువతి

తన కళాసంపదను ఆ దుర్గాదేవికే అర్పణం చేయాలని నిశ్చయించుకుంది. ఉజ్జయినిలో ప్రతియేటా జరిగే నవరాత్రి ఉత్సవాలలో దేవిసన్నిధిన మైమరచి నాట్యం చేసేది. ఆమె అపూర్వ నాట్యాన్ని సందర్శించి సంతోషించడంకోసం వేలకొద్దీ జనం పోగయ్యేవారు.

తన యెదుట వినయంగా వచ్చి నిలిచిన చిత్రలేఖను చూసి శ్రీదేవి చెప్పనారంభించింది. "అమ్మాయీ, పరాశక్తికి నువ్వు చేస్తున్న సేవను గురించి నే నెరుగుదును. కాని దేశక్షేమంకోసం నువ్వు నీ భగవత్సేవను కొద్దిరోజులు వదిలిపెట్టవలసిన అగత్యం కలిగిందిప్పుడు. ఈ దేశపు రాజూ, ప్రజలూ కూడా ఈ విషయంలో నీ దయకే ఎదురుచూస్తున్నారు. వింటున్నావా! నువ్వు రేపే ఇక్కడనుంచీ బయలుదేరి శాఖలా నగరానికి వెళ్లాలి. ఏ విధంగానైనా హూణచక్రవర్తి మిహిరకులుణ్ణి నీ మోహపాశాలలో బంధించాలి. నీ సామర్థ్యం చేత అతని సైనికబలాన్నీ, దేశపరిస్థితులను గురించిన విషయాలు పోగుచేయాలి. ముఖ్యంగా రాజభవనానికీ, నగరివెలుపల ఉన్న శివాలయానికీ మధ్య సొరంగం ఉన్నదా అనే విషయం కనిపెట్టాలి. రాబోయే పౌర్ణమికి మరుసటి దినం ఆ శివాలయం యొక్క ఉత్తర ప్రాకారంలో మన సైనికుడొకడు నిన్నెదురు చూస్తుంటాడు. నువ్వు సేకరించిన వివరాలన్నీ అతనికి తెలియజేసి, ఇక అక్కడ ఉండవలసిన అగత్యం లేకపోతే వెంటనే వచ్చేసేయి. ఏం - అర్థమయిందా? ఆక్షేపణ యేమీ లేదుకదా?"

"దేవీ! తమ చిత్తం - నా భాగ్యం. తమ మాటలు కాదని నేనేమి చెప్పగలను?" నమ్రస్వరంతో పలికింది చిత్ర. శ్రీదేవి ముఖం వికసించింది. తన వ్రేలినుండీ మరకతమణి పొదిగిన ఉంగరం తీసి చిత్రలేఖ వ్రేలికి తొడుగుతూ—

"చిత్రా! ఏవిషయాన్నీ మరుగుపరచదలచుకోలేదు నేను. నువ్వు పూనుకునే పని అతిభయంకరమైనది. అపాయాలతో నిండిన చోటుకు వెళ్తున్నావ్. ఎప్పుడైనా నీ శీలం కళంకితమయ్యే అపాయం సంభవిస్తే, ఈ మరకతమణి అడుగునగల తెల్లటి పొడిని మింగేసేయి. దుర్గామాత వెంటనే నిన్ను తనవద్దకు పిలుచుకుంటుంది. కాని ... అలా ఏదీ జరగకూడదని నేను ప్రార్థిస్తున్నాను." శ్రీదేవి చెమ్మగిలిన కళ్లతో చిత్రలేఖ తల నిమిరి ఆశీర్వదించింది. చిత్ర రాజమాత పాదాలు కళ్లకద్దుకుని గదిలోంచీ వెళ్ళిపోయింది.

## 3

గాఢనిద్రలో మునిగి మంచంపై చిందరవందరగా పడుకొనియున్న మిహిరకులుని మెల్లమెల్లగా సమీపించింది చిత్రలేఖ. నిశ్శబ్దంతో నిండిన ఆ విశాలమైన గదిలో మిహిరకులుని గుర్రులు మరింత పెద్దగా వినిపిస్తున్నాయి. చిత్రలేఖ మంచందగ్గిర నిలిచి నలుప్రక్కలా చూసింది. తన్ను గమనించేవారెవ్వరూ లేరని నిశ్చయం చేసుకొని వంగి మిహిరకులుని అంగీ బొత్తాలు తొలగించింది. అతని మెడలోని బంగారు గొలుసున వ్రేళ్ళాడుతోంది తాళంచెవులగుత్తి. భయంచేత చిత్రలేఖకు హృదయం ఆగిపోయినట్టనిపించింది. చేతులూ కాళ్ళూ వణికాయి. ఎలాగో మనస్సు దిటవుపరచుకుని అతని శరీరానికి తాకకుండా, అతిజాగ్రత్తగా తాళంచెవుల గుత్తిని తీసుకుంది. అంగీ బొత్తాలు తగిలించి, వచ్చినదారినే బైటికి వెళ్ళిపోయింది.

భయంచేతా, గమ్యస్థానం చేరుకోవాలనే తొందరచేతా తడబడుతూ నడిచింది. పొడుగైన వరాండా దాటి కుడిప్రక్కకు తిరగగానే ఇంకొక ఇరుకైన వరాండా. దానిచివర ఒక చిన్న దర్వాజా. తనచేతనున్న తాళంచెవులలో నొకదానితో ఆ దర్వాజా తలుపు తెరచుకొని లోపలికి వెళ్ళి తలుపు బిగించుకుంది. లోపల చీకటి గుయ్యారం, ఇరుకైన త్రోవ. కళ్లు నలుపుకొని చూసింది చిత్రలేఖ. ఏమీ కనిపించడంలేదు. మెల్లమెల్లగా చీకట్లోనే ముందుకు సాగింది. కొంతదూరం వెళ్లేసరికి త్రోవ కొంచెం విశాలమవటమేకాక వెలుగుకూడా కనిపించింది.

ఇరుప్రక్కలా తిరిగితిరిగి చూస్తూ నడుస్తున్న చిత్ర దేనినో చూసి హఠాత్తుగా ఆగిపోయింది. ఆమె కళ్లు

ఆశ్చర్యంతో మెరిసిపోయాయి. తను నడిచేత్రోవ కిరుప్రక్కలా వరుసగా గదులు రాతిని తొలిచి కట్టబడినవి! గదులన్నిటిలో అనేక విధాల ఆయుధ సామగ్రులు అపరిమితంగా ఉంచబడి ఉన్నాయి. హూణులపై దండెత్తేవారెవరైనాసరే ఈ రహస్య ఆయుధాగారాన్ని మొదట వశపరచుకున్నారంటే శాఖలానగరం ఒక్కఘడియలో పడిపోతుందని చిత్ర క్షణంలో తెలుసుకుంది. ఆమె హృదయం సంతోషంతో ఉప్పొంగింది. సమయం మీరిపోతుందన్న మాట తలపుకురాగానే వేగంగా పరగెత్తనారంభించింది. చాలా దూరం వెళ్ళిన తర్వాత మెట్లుకనిపించాయి. గబగబా పైకెక్కింది. చివరిమెట్టుచేరుకోగానే ఒక దర్వాజా కనిపించింది. తనచేతిలోని తాళంచెవితో ఆ తలుపుకూడా తెరుచుకొని మెల్లిగా తొంగిచూసింది. ఎవ్వరూలేరని నిశ్చయం చేసుకున్న తర్వాత నెమ్మదిగా బైటికివచ్చింది.

తనచుట్టూ కలయజూచుకొని ఆశ్చర్యంతో స్తంభించిపోయింది చిత్రలేఖ. ఆమె పట్టణం వెలుపలగల శివాలయ గర్భగృహానికి వెనుకగల గదిలో నిల్చున్నదిప్పుడు. శ్రీదేవి గుర్తుచెప్పిన అదే శివాలయం. "ఒక దెబ్బకే రెండుకాయలు రాలినట్లు" ఆయుధాగారం ఉన్నచోటూ సారంగపుటునికీ ఒక్కసారే తెలిసిపోయినందుకు చిత్రకు చెప్పలేని సంతోషంకలిగింది. మొదట ఆశ్చర్యం కొంత తగ్గిన తర్వాత, దేవాలయం అంతా ఒక్కసారి తిరిగిచూసి, తెల్లవారబోయే సమయానికి తొందర తొందరగా, వచ్చినదారినే తిరిగివెళ్ళింది పరిపరివిధాలా ఆలోచిస్తూ. కొద్దిసేపట్లోనే రాజభవనంచేరుకుని, మిహిరకులునిగదిలో ప్రవేసించింది. అతను మొదటిమాదిరిగానే గుర్రులుపెట్టి నిద్రిస్తున్నాడు. చిత్ర నెమ్మదిపొందిన మనస్సుతో తాళంచెవులగుత్తి నెప్పట్లాగా బంగారు గొలుసుకు తగిలించబోయింది. అంతలో ఏదో తలపుకువచ్చి, ఆరిపోయిన మైనపువత్తిలో తనకు కావలసిన తాళంచెవిని గట్టిగా ఒత్తితీసింది. తాళంచెవి ఎప్పట్లాగా గొలుసుకు తగిలించి, మైనపు వత్తిమాత్రం జాగ్రత్తచేసుకుని వెళ్ళిపోయింది. పాపం! విజయ గర్వంతో ఉప్పొంగి ఒక్క విషయం గమనించలేదు చిత్ర. గడపదాటకముందు ఒకసారి వెనుదిరిగి చూసిఉంటే మిహిరకులుని అరమోడ్పుకళ్ళు తన్ను చూశాయని, అతని పెదవుల్లో చిరునవ్వుతోచి మాయమైందని తెలుసుకునేదేమో.

## ౪

మరుసటిరోజురాత్రి, పన్రెండుగంటలు దాటింది. ఏకారణంచేతనో మిహిరకులుడు ఆ రోజంతా చిత్రలేఖనంతగా గమనించనట్లు కనిపించాడు. అదికూడా తనమేలుకోరకే అనుకొని మురిసిపోయిన చిత్ర మొదటిరాత్రిలాగానే సారంగంవేపు బయలుదేరింది. మైనపుముద్ర సహాయంతో తయారుచేసి తనవద్ద ఉంచుకొన్న తాళంచెవితో సారంగపు దర్వాజాతలుపు తెరచుకొని లోపలికి ప్రవేశించింది. సారంగపుత్రోవన త్వరగా ముందుకుసాగిపోయింది. కాని పదిగజాల దూరంలో తన్ను వెన్నంటివస్తున్న ఒక వ్యక్తిని మాత్రం గమనించనేలేదు. శివాలయ 'గర్భగృహం చేరుకోనేటప్పటికి ఎక్కడినుండో నక్కఅరుపు వినిపించింది. చిత్రకు గుండెలు ఝల్లుమన్నాయి. మనసు కుదుటపరచుకొని దుర్గానామం స్మరిస్తూ ఉత్తరప్రాకారం వేపుకు బయలుదేరింది.

షుమారు నూరుగజాలు పొడుగైన ఆ ప్రాకారం పాలవెన్నెలలో ప్రకాశవంతంగాఉంది. చిత్రలేఖ ఒకచోట ఆగి చూపుమేరన ఎవరైనా మనిషిగాని, గుర్రంగాని కనిపిస్తారేమోనని చూసింది. ఎవ్వరూ కనిపించలేదు. చివరిదాకావెళ్ళిచూడడమే ఎందుకైనా మంచిదనుకొని ఒక్కఅడుగు ముందుకుసాగగానే తనవెనక ఏదో నీడ కనిపించినట్లయి గిరుక్కున వెనక్కి తిరిగింది. ఎదురుగా నిప్పులుకక్కుతూ నిలుచున్నాడు మిహిరకులుడు. చిత్రలేఖ అరవాలనుకుంది గాని ఎంత ప్రయత్నించినా గొంతూ లేవలేదు. అపరిమితమైన భయంచేత ఆమెగొంతు బిగిసిపోయింది.

ఆ భయంనుంచీ తెప్పరిల్లేముందే ఇంకొక రోమాంచకారియయిన ఘటన సంభవించింది. మిహిరకులుణ్ణి

ఎవరో గట్టిదెబ్బ కొట్టారు తలమీద. పెద్దగా అరుస్తూ క్రిందపడిపోయిన హూణ చక్రవర్తి వెనక చేతనొక కర్రతో నిలువబడిన మనిషిని వెంటనే పోల్చుకుంది చిత్ర మహారాజు యశోవర్మ! అనుకోకుండా క్షణకాలంలో జరిగిపోయిన విచిత్ర సంఘటనలకు దిగ్భ్రమచెంది నిల్చుండిపోయింది చిత్ర. చేతిలోని కర్రను పారవేసి ఆమెచెయ్యి పుచ్చుకొని ఉత్తరద్వారంవైపుకు పరుగెత్తాడు యశోవర్మ. ద్వారం వెలుపల తయారుగా నించున్న గుర్రంపైకి దుమికి కూర్చున్న రాజు వెనక అతని నడుముకి చేతులు బిగించి కూర్చుంది చిత్ర. దక్షిణ దిశగా పరుగు తీసింది గుర్రం.

సారంగంలో చిత్రలేఖను వెన్నంటివచ్చిన మిహిరకులుడు, తన వీరులు కొందర్ని శివాలయానికి రమ్మని చెప్పి ఉంచాడు మొదటనే. గుర్రాలను తూర్పు ద్వారాన కట్టేసి లోనికివచ్చిన వీరులు తమ చక్రవర్తినెవరో కొట్టేసి పారిపోవడం చూశారు. కురచకాళ్లుగల హూణులు వేగంగా పరుగెత్తలేరుగాబట్టి వాళ్లు మొదట గుర్రాలకోసం తూర్పు వాకిలివేపుకి నడిచారు.

శాఖలానగరానికి దక్షిణాన నాలుగైదు క్రోసుల వరకూ ఎత్తుపల్లాలు లేకుండా భూమి సమంగా ఉంటుంది. అది దాటిన తర్వాత కొద్ది దూరంలో ఒక యేఱు ఎదురౌతుంది. దానిని దాటితే దట్టమైన అడవిని చేరుకోవచ్చు. ఆ వైపుకే తన గుర్రాన్ని అతివేగంగా పరుగెత్తించాడు యశోవర్మ. వెనక తరుముకుంటూ వస్తున్న హూణులు నిముష నిముషానికీ దగ్గిరపడుతున్నారు. ఆ! ఏటిగట్టు చేరుకుంది యశోవర్మ గుర్రం. వెడల్పైన కొండవాగు అది. ఇరువైపులా గట్లనొరుసుకుంటూ నిండుగా ప్రవహిస్తూంది. వీలైతే ఎదుటిగట్టు చేరుకుందాం, లేదా శత్రువులచేత జిక్కడంకంటే ఏటిప్రవాహంలో చావడంమేలనియెంచి, గుర్రాన్ని కళ్లెం సడలించి నీళ్లలోకి నడిపించాడు యశోవర్మ.

నట్టేట లోతైనచోట ముందుకు సాగలేక ప్రవాహంతో పెనగులాడుతోంది గుర్రం. అదే సమయంలో గట్టుమీదినుండి హూణుడు వదిలిన అమ్ము కటీక్కరన వచ్చి చిత్రలేఖ వీపున ఘాటంగా నాటుకుంది. కాని ఆ వీరయువతి నోటినుంచీ బాధాసూచకమైన ఏచిన్న శబ్దంకూడా వినబడనేలేదు.

ఆ మరణావస్థలోకూడా మహారాజును కాపాడాలన్న ఒకే విషయం ఆమె మనస్సంతా నిండిఉంది. మహారాజుకు డాలువంటి తనుపడిపోతే అతని ప్రాణాలకు అపాయం తప్పదని దైవికమైన మనోబలంతో తనపట్టు సడలించకుండానే కూర్చుంది.

ఇంతలో కొంచెం ముందుకుసాగిన గుర్రం గట్టినేల కాలికి తగలగానే చరచరా గట్టెక్కనారంభించింది. మహారాజుకుగల అపాయంకూడా అంతకంతకూ దూరమౌతూ వచ్చింది. కాని చిత్ర మాత్రం మరణాన్ని మరీ మరీ సమీపిస్తూఉంది. బలం ఉడిగిపోతూఉంది. ఇంకా ఆలస్యంచేయడం మంచిది కాదని, శాఖలా నగరంలో తను సేకరించిన వివరాలు వ్రాసి నడుముకు బిగించి ఉంచిన పత్రాన్ని అతికష్టం మీదతీసి యశోవర్మచేతి కందించింది. “మహారాజా! నా పని పూర్తయింది. కర్తవ్యం నెరవేర్చానన్న సంతోషంతో వెళ్తున్నాను.’ సెలవియ్యండి” అని హీనస్వరంతో చెప్పగలిగింది. చేతులపట్టు సడలి, వాడిపోయిన తీగెలా, ఆమె శరీరం గుర్రంపైనుంచీ పడిపోయింది.

ఆమె మరణావస్థను ఇంతవరకూ గుర్తించని మహారాజు వెనుదిరిగి చూశాడు కలవరపాటుతో. సుళ్లు తిరుగుతూ ప్రవహిస్తున్న ఏటిలో అమ్ముచే భేదించబడిన చిత్రలేఖ శరీరం కొట్టుకుపోతూండడం కనిపించింది. అతనికళ్ళవెంట అప్రయత్నంగా రెండశ్రుబిందువులు రాలాయి.

ఈ ఘటన జరిగినది క్రీ. శ. 529-వ యేట. ఆ తరువాతి సంవత్సరమే యశోవర్మ మగధ సామ్రాజ్యాధిపతియైన భానుగుప్త బాలాదిత్యునితోనూ ఇతర సామంతరాజులతోనూకలిసి మిహిరకులుని ఓడించి, చెఱపట్టి చరిత్రప్రసిద్ధి జెందాడు.

కాని మాళవదేశపు మహారాజుకోసం, అతని ప్రజల మేలుకోసం కిక్కురుమనకుండా ప్రాణత్యాగం చేసిన నాట్యరాణి చిత్రలేఖపేరు చరిత్రకు సంబంధించిన ఏపుస్తకంలోనూ కనిపించకుండానే మాసిపోయింది.

# మీకు తెలుసా!



ఎడిత్‌చార్లో అనే వనిత ప్రపంచంలో అందరికంటే చిన్నదైన మరుగుజ్జుగా పేర్కొన్నారు. ఈవిడ ఎత్తు 22 అంగుళాలు. వయస్సు 25 సం॥లు. బరువు 17 పౌనులు. పదిహేనుమంది సంతానంలో యీమె ఒకర్తె. ప్రస్తుతం సర్కస్ కంపెనీలో పనిజేస్తోంది. – ఈమె రోజుకి నలభై సిగిరెట్లు కాలుస్తుంది – ఉయ్యాల తొట్టిలో నిద్రపోతుంది.

♦ ♦ ♦

తొలిసారిగా ఇద్దరు భారతీయ మహిళలు పర్వతారోహణం చెయ్యడం ప్రధాని నెహ్రూ తిలకించారు. దాదాపు గంటసేపు జరిగిన యీ యద్భుత ప్రదర్శనంలో పాల్గొన్నది ఎవరెస్ట్ విజేత టెన్సింగ్ మేనకోడళ్లు. తాళ్లుపట్టుకొని వీరు అతిసులభంగా పర్వతం ఎక్కారు. టెన్సింగ్ స్వయంగా వీరికి మార్గదర్శకత్వం వహించారు.

♦ ♦ ♦

1951 జనాభ లెక్కల ప్రకారం పట్టణాల్లో నివసించేవారు 31,77,833 మంది.

తెలుగు రాష్ట్రంలోని స్త్రీలు 10 1,94,066 మంది. పురుషులు 1,63,13,725 మంది.

స్త్రీలలో అక్షరాస్యులు 100 కి 5.5 మంది.

♦ ♦ ♦

1921 లో ప్రతి వెయ్యిమందికి శిశుమరణాలు 30 తటస్థించాయి. 1941 లో అటివి వెయ్యిమందికి 50 తటస్థించాయి.

1913 35 మధ్య ప్రతి వెయ్యి కాన్పులకి 8.2 బాలింతలు మరణించారు. 1946–50 మధ్యలో 7.1 బాలింతలు మరణించారు.

పిల్లా సుబ్బారావుశాస్త్రి


## అమ్మకానికి సిద్ధంగా నున్నవి!

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారి విరచితం ‘శ్రీ జ్ఞానప్రసూనాంబికా శతకము’ రు. 0 6 0

,, స్థానాపతి రుక్మిణమ్మగారి ,, ‘దేవీభాగవతము’ ,, 12 8 0

,, చిల్కపాటి సీతాంబగారి ,, ‘అరవింద’ (నవల) ,, 1 0 0

శ్రీ డాక్టరు కే. యన్ కేసరిగారి ,, ‘వేప’ ‘బిల్వ’ ప్రతి 1–కి ,, 0 12 0

గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట, మద్రాసు 14.

# కూరల బేరం

శ్రీ ఆకెళ్ళ జానకిరామ సుబ్రమణ్యం.

'వంకాయలు...బీరకాయలు...దొండకాయలు.. బంగాళాదుంపలు...వుల్లిపాయలు...'

కేకేసుకుంటూ, కూరలమ్మే కామన్న కావిడ బుజాన వేసుకుని, కర్ర చేత్తో పట్టుకుని, కామయ్య శాస్త్రి గారింటికి బయలుదేరాడు.

ఆ వూళ్ళో కూరలమ్మటం అయిన తరువాత వూరు చివరనున్న కామయ్యశాస్త్రి గారింటికి ప్రతీరోజు మిగిలిపోయిన చచ్చు - పుచ్చు కూరగాయలు తీసుకు వెళ్ళి, ఆయన కొన్నా - కొనకపోయినా, మాపెడుతూ వుండటం కామన్నకొక అలవాటయిపోయింది.

కామన్న ఈ వ్యాపారం మొదలుపెట్టి రమారమి నాలుగు నెలలు కావస్తోంది. ఏదో నాలుగురాళ్ళు సంపాదించుకుంటున్నాడు. వ్యాపారం, బుట్టలోంచి తట్టలోకి, తట్టలోంచి కావిడలోకి 'ప్రోగ్రెస్' చూపెట్టింది.

అమెరికా - పాకిస్తాన్ 'యగ్రిమెంటు' లాగ కామయ్యశాస్త్రి గారికి కామన్నకి ఏనాడో, అంటే వ్యాపారం మొదలు పెట్టినప్పటినుంచి, కామయ్య - కామన్న 'యగ్రిమెంటొ'కటి స్థిరపడిపోయింది. ఇంత వరకు శాస్త్రి గారు ఒక్క కానీ పెట్టి ఏ కూర కొనకపోయిన, ప్రతీరోజు కామన్నమాత్రం వచ్చి - వెళ్ళటం మానలేదు.

కామయ్యశాస్త్రి గారి ఇల్లు సమీపించేసరికి, తిరిగి గట్టిగా ఒక్కసారి కేక పెట్టాడు కామన్న.

అప్పుడే పాదులుకి నీళ్ళుపోసొచ్చి, పడక కుర్చీలో పడుకుని పేపరు చదువుకుంటున్న శాస్త్రి గారికి, కామన్న కేక వినబడేసరికి, అమాంతంగా, అర గజం ఎత్తు ఎగిరి, అరనిముషంలో అరుగుమీదకొచ్చి వాలారు.

ఎందుకో ఈవేళ అంత సంతోషం?

ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నారు, వంకాయ కూర వండుకోవాలని. కామన్న కేకలో 'వంకాయల' మాట వినేసరికి ఎక్కడలేని సంతోషంవచ్చి పడింది. పెరట్లో అన్నిపాదులు పెట్టుకుని వంగ తోటకు మాత్రం చోటులేకుండా చేసుకున్నారు. పెరట్లో పెట్టుకున్న పాదుల మూలంగా, పైగా పావలా అర్ధా సంపాదించుకుంటున్నాడాయన.

మామూలు అలవాటు ప్రకారం, కామయ్యగారి ఇల్లు సమీపించి 'శాస్త్రులు' గారు అని పిలవబోయి, ఆయన అరుగుమీద వుండటం చూసి ఆశ్చర్యపోయాడు.

శాస్త్రిగారి 'ముఖకవళిక' చూసేసరికి కామన్నకి కొంచెం ఆశలు చిగురించాయి, ఏదైనా బేరం తగులుతుందేమోనని.

'రావోయ్ కామన్న ... అల్లా అరుగుమీద దింపుకో' అని ఆప్యాయంగా పలకరించేసరికి కామన్నకి ఆశ్చర్యం వేసింది. ఇన్నాళ్ళనుంచి చూస్తున్నాడు, ఒక్కసారికూడ కామయ్యగారు ఈ విధంగా పలకరించలేదు.

'అమ్మయ్య' అనుకుంటూ, కావిడ బుజంమీద నుంచి దింపుకుని, కర్ర అరుగుమీద పెట్టి, చతికిల పడ్డాడు కామన్న.

'ఈవేళ కూరలేం అమ్మలేదేమిటి? ... తట్టనిండా కూరలున్నాయి.' అన్నారు శాస్త్రిగారు.

'ఏం కూరలండీ...ధరలు మండిపోతున్నాయి... కొనేవాళ్ళెవరూ లేరు.' అన్నాడు కామన్న కొంచెం బాధగా.

'బాగా చెప్పేవ్ ... ఇప్పుడు కూర ఎక్కడపడితే అక్కడే దొరుకుతున్నాయి ... పెద్ద ధరలిచ్చి కొనుక్కోవలసిన అవసరం ఏముందిలే? ... ఏ ఏ కూరలున్నాయి?' ప్రశ్నించారు కామయ్యగారు.

'వంకాయలు, బీరకాయలు, దొండకాయలు, బంగాళాదుంపలు ...' స్పీడుగా చెప్పుకు పోతున్నాడు కామన్న.

'చాల్లే, ఆ దండకం ఆపుచెయ్యి... వంకాయలు ఎల్లా ఇస్తున్నావ్?' అడిగారు శాస్త్రిగారు.

'ఎల్లాగో అల్లాగ తీసుకుందురుగాని. మీక్కు బేరం చెపుతానేమిటండీ ... ఓ వీశ ఎయ్యమంటారా?' అంటూ తక్కెడా, తూకంరాళ్ళు పైకితీసాడు.

'మొట్టమొదట ధర చెప్పు... తరవాత చూద్దాం' అన్నారు శాస్త్రి.

'ధరకేంటిలెండి. అందరికి యిచ్చినట్టుగానే మీకూను...ఏం? మీకు కొత్తబేరం చెపుతానా?... అదేంటండోయ్,' అన్నాడు కామన్న నిక్కర్చి మనిషిలాగ.

'నీ సంగతి నా దగ్గర చెప్పకు ... నువ్విప్పుడు ఈ విధంగా అంటున్నావుగదా, మొన్నను ఏం చేశావ్ చెప్పు ... నా దగ్గర తొమ్మిది డబ్బులికి ఒక్కదమ్మిడీకూడ తగ్గనని చెప్పి వాళ్ళకి ఎంతకిచ్చావ్? బేడకిచ్చావా!' అన్నారు కామయ్యగారు.

'మొన్నటి కాయలు మంచివికాదండీ ... మీవంటి పెద్దలికి అటువంటి కాయలిచ్చి మళ్ళీ పిలిపించుకోవాలా! మీచేత' అనేసరికి శాస్త్రిగారు కొంచెం చల్లబడ్డారు.

'వంకాయలు చివరికి ఎల్లాయిస్తావు? ... నీ దగ్గరన్నీ 'హైక్లాస్' రేట్లుకూడాను.' అన్నారు శాస్త్రి.

'ముత్యాల్లాంటి మువ్వొంకాయలు. కారంపెట్టి వండుకుంటే కమ్మగా వుంటాయి ... ఓ వీశ వెయ్యమంటారా?' అడిగాడు కామన్న.

'ఈ విషయం నువ్వు చెప్పాలేమిటి?...కారంపెట్టి వండుకుంటే ఏ చచ్చుకూర కమ్మగా వుండదూ ... అయినా నువ్వు చెప్పినట్టు కారంపెట్టి వండుకుందామన్నా మిరపకాయలు చవగ్గా ఏడిశాయనా?...వీశ మూడు, నాలుగూనూ ...' అన్నారు శాస్త్రిగారు.

'చూశారూ ... ఈ నవనవలాడే నల్లొంకాయలు కూర వండుకుంటే, నమలకుండానే జీర్ణం అయిపోతాయంటే నమ్మండి ... అంత ఎందుకు? ... ఈ వేళ మీరీకాయలు పుచ్చుకుంటే... రేపు మళ్ళీతీసుకురా... అంటారు ... ఒక్కవీశ కాయలు పుచ్చుకచూడండి.' అంటూ ప్రాధేయపూర్వకంగా 'పోజు' పెట్టేడు.

'ఇంతకీ ధర చెప్తావా - చెప్పవా?' అన్నారు శాస్త్రిగారు కొంచెం కోపంగా.

'ముప్పావలా ఇప్పించండి' అన్నాడు ముక్తసరిగా.

'ఏమిటీ! ...' తెల్లబోయారు శాస్త్రిగారు.

'వీశ —'

'వీశ ముప్పావలా ... చాల్లే ... ఎవరైనా వింటే నవ్విపోతారు. లోకంలోలేని ధర చెప్తావేంటి?' అన్నారు శాస్త్రి.

'అసలు మీరు కాయలు చూశారా ... ఆ నవనవ ... ఆ నిగారింపు ...' అంటూ కామన్న ఇంకా చెప్పుకుపోతుండగా ...

'నవనవ ... ఎవడెరగని నవనవ యిది ... నానా తుక్కువేసి వెధవ పెంపకాలు పెంచుతుంటే ఈ నవనవ రాకేం చేస్తుంది ... నాదగ్గర చెప్పకు నీ కబుర్లు.' అన్నారు శాస్త్రిగారు కోపంగా అడ్డుకుంటూ.

'శాస్త్రులుగారూ ...ఏమిటో చెపతారు కాని... అందరూ మీకుమల్లే...ఓపిగ్గా... పెరట్లో పాదులెట్టుకుని పెంచుతారేంటండీ.' అనేసరికి శాస్త్రులుగారు సగం చల్లబడ్డారు.

'ఇదిగో...నువ్వుచెప్పిన ధరవుతే వీశకాదుకదా.. ఆఖరికి అరపంపుకూడ అక్కరలేదు...అసలు లోకంలోనే ఎక్కడా కాయిలు కొరకటంలేనట్టు చెపుతావేటి?' అన్నారు శాస్త్రిగారు ఆ చంకనున్న తువ్వాలు ఈ చంకనపెడుతూ.

'నేనెంత చెపుతే అంతా యిస్తారేటండీ ... అడగండి ... గిటితే యిస్తాను; లేకపోతే లేదు...'

'నేనడగటంకాదు. నువ్వేచెప్పు ... ఇంతకయితే గిటుతుంది. లేకపోతేలేదని...'

'అయితే ఆఖరిమాట చెప్పమంటారా?—'

'ఆఖరిమాటే చెప్పు ... కచ్చితంగా చెప్పు ... ఏం... నీకేమైనా భయమా ... నీకాయలు నీదగ్గరున్నాయి. నాడబ్బు నా దగ్గరుంది.'

'నిజం చెపుతానండి ... సరిగ్గా పదణాలకి కొన్నాను ... దానిమీద ఎంత లాభంయిస్తే అంతా పుచ్చుకుంటాను ... తరవాత మీయిష్టం.'

'లాభంలేదు. ఐదణాలకి, గిట్టుతుందా...ఇదుగో ... నేనిల్లా అడుగుతున్నానని కోపం మాత్రం పడకు. నువ్వు అడగమన్నావుకనక అడుగుతున్నాను.'

'అబ్బే, అంతవారగా అడుగుతే ఎవడిస్తాడండి... సగానికి సగం తేడాయే ...' అన్నాడు కామన్న ఆశ్చర్యార్థకంగా.

శాస్త్రిగారు మాట్లాడలేదు.

ఒక్క నిముషం తరవాత —

'మీకు నిజంగా కావలిస్తే అర్థరూపాయిచేసి తీసుకోండి ...అదేనా మీకు కనక ...'అన్నాడు కామన్న.

'ఇదుగో...వింటున్నావా? ... కాయలు ముమ్మరంగావున్న రోజుల్లోకూడ నువ్వింత ధరచెపితే ఎవడిచ్చుకుంటాడోయ్ ... కాయలు దొరకనిరోజుల్లో అంటావా...నివ్వెంతచెపితే అంతాయిచ్చి పుచ్చుకునేవాణ్ణి. తెలుసా' అన్నారు శాస్త్రిగారు నిర్లక్ష్యంగా.

'చివరికి ఎల్లాకావాలంటారు ?...'

'ఆ మాటకూడ నువ్వే చెప్పెయ్...నానోటంపట కూడ ఎందుకు ?...'

'ఏడణాలుచేసి తీసుకుంటారా...'

కొంచెంసేపు ఆలోచించి—

'ఓ అర్ధణా తీసుకో' అన్నారు శాస్త్రిగారు.

'అంటే ? ...'

'ఐదణాలన్నర'

'మీదగ్గర గుణం యిదేనండి ... కానీ, అర్ధణా అంటారు...అందుకనే ఈ నాలుగు నెలలనుంచి మీకు నాకు ఒక్క బేరం కూడ కుదరలేదు.' అన్నాడు కామన్న విసుగ్గా.

'ఏదో ఇచ్చివెళ్ళాలికాని ... వూరికే బేరం ఆడతావెందుకు చెప్పు ... ఈ నాలుగు నెలలనుంచి, నీ దగ్గర ఒకసారికూడ, కూరలు కొనలేదనిచెప్పి ... ముఖ్యంగా కొనకపోతే బాగుండదని ... ఈ రోజున కొందామని బుద్ధిపుట్టింది...అందుకోసం ఈ విధంగా బేరం ఆడుతున్నావ్. అవునా...'

ఒక్క నిముషం ఆగి...

'ఇదుగో...ఇంకోకాని తీసుకుని ఓ వీశ కాయలు తూచు.' అన్నారు శాస్త్రిగారు.

'సరిగ్గా చెపుతున్నాను... ఆరణాలుయిప్పించండి ... ఇంక బేరం అడగద్దు ... కావలిస్తే పుచ్చుకోవటం, లేకపోతే మానెయ్యటం ... అంటూ కావిడి బుజాన వేసుకుని లేవబోయాడు.

'పోనీలే ... రా ...' అంటూ నవిగారు శాస్త్రిగారు.

కామన్న గబగబ తక్కెడతీసి 'బేలన్స్' నిలపెట్టి—

'బాబయ్యగారూ ! జాగ్రత్తగా చూడండి ... మళ్ళీదాళవాపుందనగలరు' అంటూ ఒక వైపున రాళ్ళువేసి మరొకవైపున కాయలువేశాడు.

'కామన్న...జాగర్తగాతూచు...అదేమిటి? ఆ కొమ్ము అలాపైకి లేచిపోతోంది ... ఇంకో కాయి పడుతుందేమో... న్యాయంగా మాత్రం తూచు ... ఇదుగో ... తూకం అంటే ప్రమాణంతో సమానం తెలుసా.' అన్నారు శాస్త్రిగారు.

'నేనెప్పుడైనా దగాచేస్తే మీరలా అనాలి ... ఈసారి చూడండి ... నాతూకానికి, ఒక్క తులం తక్కువస్తే, తులానికి రూపాయి ముదరాయిస్తాను.' అంటూ తూచినకాయలు శాస్త్రిగారి అంగవస్త్రంలో వేసేడు.

'ఓ రెండు కాయలు వెయ్యి ... అయ్యో ... వీశ కాయలు పుచ్చుకుంటే రెండుకాయలైనా వెయ్యవేంటి?' అంటూ రెండు కాయలు తీసుకున్నారు శాస్త్రిగారు.

'ఆ...ఆ ... మీరలా తీయకండిమరి ... అయిన కాడికీ యిస్తూ, ఇదో దండగమళ్ళీను ...' అంటూ కొంచెం బెట్టుసరిచేసి, డబ్బులు తీసుకుని వెళ్ళిపోయాడు.

తరవాత ఏముంది? —

చవగ్గా కొనేసేననే ధీమా.

పైగా రెండుకాయలు కొసరు.

శాస్త్రిగారి సంతోషానికి అంతులేదు.

'ఒసేవ్ ... ఇల్లారా ... వంకాయలుకొన్నాను. జాగ్రత్తచెయ్యి' అంటూ పంచవూడిపోతున్నా లెక్కచేయకుండ, సంతోషంతో పెళ్ళాం దగ్గరికివచ్చి, ఎదురుగుండా దిమ్మరించారు శాస్త్రులుగారు.

'ఎన్నికొన్నారు?' ప్రశ్నించింది భార్య.

'వీశ ... శుభ్రంగా నాలుగు కూరలవుతాయి ... కారంపెట్టి మరీవండు' అన్నారు శాస్త్రి.

'వీశ! ...' అంది ఆశ్చర్యపోతూ.

'ఏం. చవగ్గా వచ్చేయని వీశ పుచ్చుకున్నాను... నాలుగు కూరలు అవ్వవనా నీ వుద్దేశ్యం ... నిక్షేపంగా అవుతాయి.'

'అందుకోసం కాదండీ...అసలివి వీశ వుంటాయా యని?' అనుమానంగా అడిగింది.

'మంచిదానివే. వీశ వుండకేం ... దగ్గరుండి మరీ తూయించాను... పైగా రెండుకాయలు కొసరు కూడ వేయించాను' అన్నారు శాస్త్రిగారు ధీమాగా.

'ఏమో ... నాకనుమానంగావుంది' అంది శాస్త్రిగారి భార్య.

'నీ కంతగా అనుమానంగావుంటే ఓసారి తక్కెడ, రాళ్ళుతెచ్చి, తూచు ... నీ అనుమానం తీరిపోతుంది' అన్నారు శాస్త్రిగారు.

శాస్త్రులుగారిభార్య, తక్కెడ, తూకంరాళ్ళు తెచ్చింది. ఒకవైపునరాళ్ళు, మరొకవైపున కాయలు వేసి తూచుతూ—

'వీశ ఎల్లాగ కొన్నారు? ...' అడిగింది.

'చవగ్గానే వచ్చాయిలే... మొట్టమొదట ముప్పావలా చెప్పిన వెధవని ఆరణాలకి వప్పించాను ... 'వద్దు. మొర్రో' అంటున్నా రెండుకాయలు కొసరుకూడ లాక్కొచ్చాను' అన్నారు శాస్త్రిగారు గర్వంగా.

'మంచిపనిచేశారు' అంది నవ్వుతూ శాస్త్రిగారి భార్య.

'ఆ ... ఆ ... ఆ ... అదేమిటి? ... ఆ కొమ్ము అల్లా పైకి లేచిపోతోంది ... జాగ్రత్తగా పట్టుకున్నవా...నువ్వేసింది వీశరాయేనా ... ఆ... వీశే ... పో నీ పదలంవేసిచూడు ... రామచంద్ర ... సగానికి సగం తరుగే ... పచ్చిదగా. మోసం ... వెధవ ... వీశనిచెప్పి పదలం తూస్తాడా ... రేపు మళ్ళా వస్తాడా ... రానీ చెపతాను ... నలుగురులోను పెట్టి నానాచివాట్లు పెట్టించనూ ... ... ప్రతీరోజూ మనింటిచుట్టు తిరుగుతున్నాడుగదా, ఒకసారీ కొనకపోతే బాగుండదనుకొంటూ, ... ఈ రోజునే కొన్నాను ... వెధవ...ఇన్నాళ్ళనుంచీ సరదాగా మాట్లాడుతుంటే పెద్ద మనిషనుకున్నాను ... మోసంచేస్తాడన్న సంగతి నాకేం తెలును ... తేనెపూసినకత్తి ...' అంటూ నెత్తి, నోరు, బాదుకుంటూ, నోటికిరాని, నానాతిట్లూ, తిట్టి పోసేడు కావన్నని.

ఆ రోజునుంచి, ఈ రోజువరకు, కూరల కామన్న, కామయ్య శాస్త్రిగారికి, కనబడితే ఒట్టు.

# గర్భవతులు గమనీయములు

శ్రీ రాచకొండ శ్రీహరి

స్త్రీ, గర్భవతియైయుండు కాలమందామె యొక్క మనోసంకల్పానుసారమున సంతానప్రాప్తికలుగును. మానసంబను క్షీరంబు మనోసంకల్పంబను వివిధాకృతులు గల యేపాత్రయందు బోయుంబడిన యా పాత్రాకృతిని దాల్చునట్లు గర్భవతుల మనోవికారంబు ననుసరించి బిడ్డలుద్భవింతురు. దీనికి పరమ భాగవతోత్తముండైన ప్రహ్లాదుండే ప్రబలసాక్షి. ఈతడసురబీజ జనితుండైనను మాతాగర్భమందుండు కాలంబున యీతని తల్లి శ్రీ నారద మహర్షికి శుశ్రూష చేసి పరమాత్మను ధ్యానించుటచే ప్రహ్లాదుండు మహాభక్తుండై జన్మించెను.

గర్భకాలంబున స్త్రీలు భగవధ్ధ్యాన నిష్ఠతో నున్నచో, వదేరీతిన పుత్రులు కూడ జ్ఞానులై జన్మింతురు. గర్భధారిణులను భయపెట్టరాదు. వీరు భయంకర కృత్యములు జూడరాదు; భయోద్భూతమగు మాటలు వినరాదు; జగడములలోనికి జనరాదు; చింతను చేరనీక సర్వదా నుత్సాహముగ నుండవలెను. మంచి మంచి సత్కథలను భూవలయమందలి నాయక నాయకీ శ్రేష్టుల జీవిత చరిత్రములను వినవలెను. లేక చదువుచుండవలెను. స్వేచ్ఛగ సంచరించుచు సాధారణ సంసారిక నిత్యకృత్యములను నిర్వహించుచుండవలెనేగాని సోమరితనము నకు చోటీయరాదు.

శ్రీ వివేకానందస్వామివారు తనకుకల్గిన సర్వజ్ఞానమును వారి తల్లివలన సిద్ధించినదని చెప్పియున్నారు. వీరి తల్లి పుత్ర సంతానము లేక కాశీక్షేత్రమందు బహుకాలము మహాశివుని ధ్యానించి వచ్చిన పిమ్మట శ్రీ స్వామివారు జన్మించిరి.

మన దొరగార్ల దేశమగు యింగ్లాండు నందొక దరిద్రబాలుడుండెను వాడు చిఱుప్రాయమునుండియు తోడి బాలురను కొట్టుట, కొరకుట, ప్రాణులను జంపుట మున్నగు క్రూర కృత్యములను జేయుచుండెను. కొంచె మెదిగిన పిమ్మట సర్వదా కత్తిని తనయొద్ద నుంచుకొనుచు చేజిక్కిన మేకలు, గోవులు మొదలగు జంతువులను వధించుచుండెను. మరికొంత కాలమునకు మానవులనుగూడ, నేకాంతస్థలములలో నరకుటకు వెనుదీయువాడు కాడు. అకారణముగ నిట్టి యకృత్యములను జేయుచుండుటచే న్యాయస్థానమున మరణదండన విధింపక, గొప్ప గొప్ప సైన్సు శాస్త్రవేత్తలను దీని కారణ మర

యుటకు నియోగించిరి. ఈ శాస్త్రజ్ఞులకు తలకొక విధముగ తలంపులు కలుగుటచే సరియగు నమ్మకము కుదరలేదు. తరువాత నొక ధీశాలి యీ దుర్మార్గుని తల్లిని విచారించెను. "నీ కుమారు డిట్లుండుటకు కారణము నీకేమైనను తెలియునా? నీవు గర్భకాలమందే యే పనుల జేసితివి?" అని యడిగెను. అందుకాయమ తాను మిక్కిలి దరిద్రురాలనియు, గోహత్య జేయు స్థలము శుద్ధిచేయుచువచ్చిన కూలిచే జీవయాత్ర గడుపుదాననియు, గోవులను మేకలను జంపునప్పుడు కరచరణముల బట్టుకొనుటయు, చర్మము తీయుటయందు దోడ్పడుటయు, యీ పనులన్నియు మిక్కిలి యుత్సాహముగ నుండెననియు, రాత్రి యంతయు రేపెన్ని జంతువులను జంపుటయో! ఆదృశ్యమెట్లుండునో యని సర్వదా విచారించుచునుండుటయే తన పనిగా నుండెననియు విన్నవించెను. అప్పుడా మహాశాస్త్రజ్ఞుడు శిశువు గర్భమందుండు కాలమున స్త్రీ యొక్క సంకల్పము ననుసరించి పుత్రుని వృత్తియుండునని తీర్మానించెను. ఈ విధి మనుజులకు వలెనే జంతువులకును వర్తించును. గోవులు, గుఱ్ఱములు మున్నగు జంతువుల ఋతుకాలమందు గొప్ప లక్షణవంతములగు మగజంతువులుగాని వాటి యాకారములనుగాని యాడజంతువుల యెదుట నుంచెదరు. ఋతుకాలమందు ఆడు జంతువు యొక్క భావ మెట్లుండునో, దేనిని చూచుచు తలంచుచున్నదో యట్లుండు శిశువును గనును.

స్త్రీలకు జ్ఞానమత్యావశ్యకము. వారు గర్భకాలమందు దురాచారులైయుండినచో వారి కుద్భవించువారు క్రూర స్వభావులై మెలగుదురు. వారు సదాచారులై దైవభక్తిపరులై యుండినచో సత్సంతానములు గల్గి తల్లిదండ్రులకు వన్నెదెత్తురు. బిడ్డలు ప్రాయమువచ్చువరకును తల్లివద్ద మెలగుచుండుటచే తల్లియొక్క గుణములే బిడలకలవడును. తండ్రియొద్ద ప్రాయమువచ్చిన పిమ్మట నేర్చుకొనుటకు సాధ్యమగును. మరియు పురుషుల సౌఖ్యమంతయు స్త్రీల వశమునందుండునేగాని పురుషునిచే నేమియు సాధ్యముగాదు. స్త్రీ యుత్తమురాలై, వివేకవంతురాలైనచో పురుషుని యొక్క జన్మసాఫల్యము సులభము. లేనిచో పురుషునకు దానికన్న ఘోరనరకము మరియొకటిలేదు. లేబ్రాయము నుండియు బిడ్డలకు మంచి నడతలను గరుపుచున్నచో అవి యెన్నటికిని నశింపవు. అల్లిబిల్లిగ నల్లుకొన్న వెనుక యొక లతాగుల్మమును తన యాశ్రమము నుండి వేరుచేయుట యెట్లు దుర్ఘటమో యట్లే చిన్ననాటి స్వభావములు పెద్దదైన తర్వాత మార్చుట గష్టతరము.






## అవియల్

ఇది కేరళదేశపు అనుపాకము. ఇది చేయుడానికి నాలుగు మునక్కాయలు, అరటికాయలు రెండు. చామదుంపలు 2½ పలములు, తోటకూరకాడ ముక్కలు, గోరుచిక్కుడుకాయలు 2½ పలములు. అలచంద కాయలు 5 పలములు, పెద్దచిక్కుడు 5 పలములు, బంగాళా దుంపలు 2½ పలములు, కంధగడ్డ 5 పలములు, కాకరకాయ ఒకటి, పొట్లకాయముక్క ఒకటి, గెడ్డకోసు ఒక చిన్నది, బూడిద గుమ్మడిబద్ద ఒకటి, రెండు పుల్లటి మామిడికాయలు కావాలి. వానిని వేలడేసి పొడుగున సన్నని ముక్కలుగాతరిగి, శుభ్రముగాకడిగి ఒక కళాయి గిన్నెలోనుంచి, సరిపడు ఉప్పు, పసుపువేసి ఉడికించాలి. మామిడికాయ ముక్కలను అన్నిటితోబాటుకాక మిగిలిన ముక్కలు సగం ఉడికిన తరువాత వేయవచ్చును. మామిడికాయలు దొరకనిచో కొద్దిగా పుల్లటి మజ్జిగపోయవచ్చును. తరువాత పచ్చికొబ్బరికాయ కోరును, 2½ పలముల పచ్చిమిరపకాయలను, కొద్దిగా జీలకరకలిపి మెత్తగానూరి ఉడుకుతున్న ముక్కలలోపోసి కలిపి వుడకనియ్యాలి. పదినిముషాలు మూతబెట్టి సన్నటి సెగన ఉడికిన తరువాత, దించబోయేముందు అందులో ఒకపలం కొబ్బరినూనె, కరివేపాకువేసిదించాలి. ఇది వేడిగా వున్నప్పుడే చాల రుచిగా వుంటుంది.

యం. సుశీలాదేవి

## కుర్మాబోండా

బంగాళా దుంపలను ఉడకబెట్టి తొక్కతీసి ముక్కలుగా తరిగి యుంచాలి. తిరుగపోతకి సెనగపప్పు, ఆవాలు, మినపప్పు, జీలకర, కరివేపాకు, పచ్చిమిరపకాయ ముక్కలు అన్నీ వేసి బాగా వేగిన తరువాత బంగాళా దుంపల ముక్కలను దాంట్లోవేసి పరిమితంగా ఉప్పు, కారపొడిచల్లి మూత బెట్టాలి. ఎండు కొబ్బరి తురుమును, గసగసాలను ఒకటిగా కలిపి నూరి కూరదించబోయేముందువేసి కలిపి దించాలి. శనగ పిండి ఒకపాలు, బియ్యపుపిండి మూడుపాళ్లు, ఉప్పు కారంవేసి పల్చగాకలిపి కూరను ఉండలుగాచేసి యీ పిండిలోముంచి నూనెలో తేల్చితింటే చాల రుచిగా నుండును.

వి. వినత

## క్యాబేజి కాషింబీర్

పెసలను అరసోలెడు రెండు గంటలసేపు నానబెట్టుము. ఒక చిన్నపాటి క్యాబేజిని చిన్న చిన్న ముక్కలుగా తరిగియుంచుకొనుము. ఒక టెంకాయ కొబ్బరిని కోరి యుంచుకొనుము. కొంచెము పసుపు పొడి, ½ చంచా కారపొడి చిన్న ఇంగువపలుకు, కొంచము ఆవాలు, ఒక చంచా జీలకర్ర తీసికొని నూనెలో నైనా, నెయ్యిలోనైనా లేదా డాల్డాలోనైనా వేయించి అందులో క్యాబేజిముక్కలు, పొట్టుతీసిన పెసలు, కొబ్బరికోరు, తగు మాత్రంగా ఉప్పువేసి మొత్తం బాగా మగ్గునట్లు కొంచముసేపు పొయిమీద నుంచవలెను. వేడి వేడిగా నున్నపుడు మంచి అన్నసాధకముగా నుండగలదు.

'లిల్లీ'



జీవన భాగస్వాములు

# వీరనారి

శ్రీ చల్లారమణ

[అది అలెగ్జాండర్ భారతవర్షముపై దండెత్తుచున్న కాలము — ఆ కాలంలో పలువురు రాజులు పరస్పర క్రోధావిష్టులైయుండి, ఐకమత్యము చెడియుండెను. అట్టివారిలో నొకడు "రాజా అంభి". తన సాటి రాజగు పురుషోత్తమునిపై పగ సాధింపనెంచి, అంభి, అలెగ్జాండర్‌ను ఆహ్వానించెను.

పిటతగవు తీర్ప పిల్లి నాహ్వానించినటు అలెగ్జాండర్‌ను తన అన్న ఆహ్వానించుటచూచి, చెల్లెలు ధర్మశీల ఓర్చుకొనలేకపోయెను. అన్నయగు అంభికి తగదని బోధలెన్నో చేసెను. కడకు తానే 'బలి' యాయెను. ]

[రహస్యాలోచన మందిరము]

అంభి:—ఏమీ ! అలెగ్జాండర్ భరతవర్షముపై దండెత్తుట నిజమేనా?

మంత్రి:—వేగుల మాటలబట్టి జూచిన అలాగుననే యున్నది.

అం:—అసలు అలెగ్జాండర్ ఆశయమేమని? ఆతడు భారతావనిపై దండెత్తుట నిజమైతే ఇక మన రాజ్యము మొదటికబళము అగుతుంది. అంతేనా?

మం:—పాపము శమించుగాక! ... ఆలోచించిచూచిన ఆలాగుననే అగునట్లున్నది.

అం:—మన సైన్యములు ఆతని సైన్యముల ముందు మందునకుకూడ పనికిరావు.

మం:—చిత్తము.

అం:—అట్లైన ప్రస్తుత కర్తవ్యమేమిటని?

మం:—మనము అతనిని ఎదిర్చిన, ఎదిర్చకుండినను ఫలితమొకటియే !

అం:—అతనికి లొంగుటే కదూ ఆ ఫలితము! నాకు తెలుసుకాని ఇన్ని సైన్యాలను తెలిసి ... తెలిసి ఆహుతి చేస్తామా? లేక ... చేతులుకలిపి సంధి చేసుకొనుట సబబు అనుకొనెదను ?

మం:—ప్రస్తుతమునకు అదే చాల ఉత్తమము.

అం:—అట్లయిన, ఇక ఎవరెవరు ఎదిరించ సిద్ధముగానున్నారట.

మం:—మన పురుషోత్తమ మహారాజు...

అం:—హ ! హ ! బాగ్గుబాగు ! భళే ! గొప్ప అహంకారముతో పోయి కొండతో ఢీకొనినదట ... మొన్న ఎట్లో విజయముగాంచినాడని, అంతగా విఱ్ఱవీగవలెనా ?

మం:—గడచిన యుద్ధములో మనము అప్రమత్తులంగా లేకుండుటచే, ఆ పురుషోత్తముడు గెలచినాడు. కాని ఈతూరి అఖండ విక్రమ సాహసోపేతుడగు అలెగ్జాండర్‌తో, పోర ప్రయత్నిస్తున్నాడు ! పస తెలియదూ !

అం:—పసందుగ పల్కినావు ... ప్రస్తుతము మనము ఎలాగు అలెగ్జాండరుకు లొంగవలసినదే కదూ!

మం:—లొంగుటేమిటి మహారాజా? ప్రవాహము ఉత్తుంగ తరంగాలతో వెల్లువికి వస్తుంటే చెట్టు

వలె శీఘ్ర నిల్చుకొనిన పతనము తప్పదు...గతిక పోచ తాత్కాలికముగ తలవంచుకొని తప్పించు కొనుచున్నది.

అం:—మంత్రికి దగ్గ సూచన. చూడు! పురుషోత్తముడు మనల ఆ నాడు పరాభవించలేదూ ... దానికి ఈ దినము దెబ్బకుదెబ్బ తీయకూడదూ!

మం:—క్షాత్ర రక్తము ...! అవును 'దెబ్బకుదెబ్బ' రాజులకు రంగరించిపోసిన ధర్మము...

అం:—అవును! భారతీయుడు ప్రాణంపోయినను సరే, అవమానము మాత్రము సహింపలేడని తెలుసుగా! పురుషోత్తము ఆదినము మన సైన్యాన్ని దర్పముతో తరిమి తరిమి కొట్టినప్పటి దృశ్యము నా కన్నులలో ఇంకనూ మెదులుచున్నది! ఏమైనా సరే, ఆ గర్వాంధుని కన్నులు తెరిపించి తీరుతాను! రాజా అంభియనిన వెన్నాడే కోడె త్రాచని నిరూపిస్తాను.

మం:—చిత్తము. దేవర వారు తలచుకొనిన ఏ పని అసాధ్యము.

అం:-రహస్యంగా) నీవుపోయి అలెగ్జాండర్‌తో రహస్యరాయబారం జరుపుట ప్రథమకర్తవ్యం. మనకు 'సైనిక సహాయం' చేసిన మనము అతనికి మన రాజ్యంలో సైనిక స్థావరమునకై జాగా ఒసంగ గలమనుము ... తెలిసిందా! ఆ నీకుచెప్పేదేమిటి?

మం:—(కొంచెము సగర్వముగా) మంత్రి మహాజనుని విషయము నీకు తెలిసినదేగా మహారాజా!

అం:—(రహస్యముగ) ఇది ఒరుల చెవులకు ప్రాకకూడదు. అంతా అగ్గిరగల్చుకొని, భగ్గుమని మారణ హోమము ఒక్కతూరి మండువరకు ఒరులకు తెలియకూడదు - ఏం?

మం:-చిత్తము.

అం:—(హుషారుగ) విను ఇది మంచి అవకాశము - వదలుకొనిన మరలరాదు. ఆ అలెగ్జాండర్ వలన సైనిక సహాయంపొంది, తర్వాత చూడురాజా అంభి ప్రతిభ ... ఈ పురుషోత్తములు వేయిమంది వచ్చినను లెక్కకు కొనడు...

మం:—అంత ఏల మహారాజా! అసలు అలెగ్జాండర్‌కు మన దేశములో స్థావరమొసగిన, అతడే సకల వ్యవహారము నిర్వర్తించడూ?

అం:—భేష్! మంచిది! నీవీ దినమే పోయి మంతనముచేసి రావలెను. కాని ఒకరి చెవిలోనను ఈ సంగతి పడకుండుటకు అతిజాగ్రత్తగ, అప్రమత్తుడవై మెలగి, సకలము సంపూర్ణముగా నెరవేర్చుకొని రావలెను. ఏం! తెలిసిందా! ఊ! పద! గోడలకుకూడ చెవులుంటాయ్! జాగ్రత్త!

మం:—(నవ్వుచు) దేవరవారి వాక్చాతుర్యము సానలు తేరుచున్నది!

అం:—అవియన్నియు తర్వాత! ముందునీవుపో!

మం:—చిత్తము! (అంభి రాజముద్ర మంత్రికి ఇచ్చును)

[మంత్రి దానిని తీసికొనిపోవుచుండగా, తెరలో నుండి స్త్రీ కంఠమొకటి 'ఆగు' మనును - మంత్రి యులికిపడి నిశ్చేష్టుడగును. అంభి, ఆశ్చర్యముతో వెనుదిరిగి చూచును]

[అంభి చెల్లెలు ధర్మశీల ప్రవేశము]

ధర్మ:—ఆగు! ఎక్కడికి పోవునది మంత్రిమహాజనా?

అం:—(కోపముతో) ధర్మా! ఏమిటది! - మంత్రీ! పో

[మంత్రి పోవుచుండ, ధర్మశీల వాకిలికి అడ్డముగ వచ్చి]

ధర్మ:—మంత్రిమహాజనా! నీకుకూడ బుద్ధికరవైనదా? నీ మంత్రము ఇంతేనా? విద్వేషనినుమాలికి మన తల్లిగడ్డ మారణ హోమములో భగ్గుమనవలసినదేనా? నీ ఆత్మ దీనికి అంగీకరిస్తున్నదా? నీ ఆత్మకు నీవు ద్రోహము చేసికొంటావా?

అం:-(కోపం పట్టలేక) ధర్మా! ఆజ్ఞ! మంత్రినివదలు!

ధర్మ:-మంత్రీ! రాజాజ్ఞ! పో! పోయి ఆవలిగదిలో నుండు! అంతఃపురము దాటితివా, గుమ్మము దగ్గరనే కత్తివాదరకు బలియగుతావు! తెలియునా. ప్రక్కగదిలోనుండి, నేను చెప్పేవరకు వెలుపలికి రాకు! నీ విప్పుడు చేయబోవు పనిలోని ధర్మాధర్మములు తీరికగా ఆలోచించు! పో...!

[మంత్రి పోవును]

అం:-(ఆశ్చర్యం - కోపంతో] ధర్మా! ఏమిటిది! ఈ అధికారము నీకెవరిచ్చినారు?

ధర్మ:-(కొంటెగా-భావగంభీరతతో) అవునన్నాయ్! ఊరిపెత్తనం ఉడతకెందు కంటావ్ కదూ! కాని అవసరము వచ్చినపుడు శ్రీరాముడంతటివానికే ఉడత సాయంచేయవలసి వచ్చింది.

అం:-(చిరాకుగ) ఇప్పుడు మీ సాయము కోరుటకు ఏకొంప కాలిపోవుట లేదే!

ధర్మ:-(ఒకప్రక్క రగలివచ్చు కోపంతో, లేని హుషారు తెచ్చుకొనుచూ) అన్నాయ్! ఒక కొంపగాదు, మనకొంప ఒకటియైతే చాలామేలు: ప్రక్కనున్న ఇరుగు పొరుగు కొంపలు కాలిపోతే, దానికి భాద్యులెవరు? నీవేకదూ?

అం:-(వెనుతిరిగి, క్రోధవీక్షణములతో) ధర్మా!

ధర్మ:-అన్నాయ్! అంతా విన్నాను. తెఱమరుగు నుండి అంతా విన్నాను.

అం:-(ఆశ్చర్యంతో) ఆ!

ధర్మ:-అవును! ఉన్నమాటంటె ఉలిక్కిపడుతున్నావు ఎందుకన్నాయ్!

అం:-ఎన్నిదినాలనుండి ఈ రహస్య వేగువేషము?

ధర్మ:-(ఉదాశీనముగా) ఈ రోజునుండే! (గంభీరముగ) నీ విషయము నేను మొన్నటినుండి కనిపెట్టుచున్నాను. నాకు తెలియపరచకుండ, ఇప్పటివరకు ఏ రాజకీయాలోచనైనా చేసినావా? లేదు! కాని ఈ దినము నా మంతనము లేకుండగనే, మంత్రితో రహస్యాలోచన ఎందుకు జరుపుతున్నట్లని తెలిసికొనుటకు తెర మరుగునకు వచ్చినాను. అంతే! కాని వినునప్పటికి గుండెలవియు, దేశాలకూల్చే మంతనము...

అం:-(ధీర్ఘాలోచనచేస్తూ, గంభీరముగ) అవును! ఒక్కగానొక్క చెల్లెలివని, ఆలించితె...

ధర్మ:-(అందుకొని) నెత్తినెక్కి కూర్చున్నానని కదూ! నిజమే నీవు చెప్పినది...అన్నాయ్ ... (శాంతముగ) మీ విషయాల్లో అనవసరముగ జోక్యము కల్గించుకొనినందులకు క్షమించు...కాని నామాట ఒకటి ఆలకిస్తావా?

అం:-నీమాట మంతీ ఎవరికి అవసరము లేదు. స్త్రీ బుద్ధి ప్రళయాంతకః అన్నారు.

ధర్మ:-ప్రస్తుతము ప్రళయము వస్తుంటె ఇక స్త్రీ బుద్ధి ఏమిటి? చూడు అన్నాయ్! మనమిపుడు అశ్వగాండరును, మనలోని మన పగలను తీర్చుకొనుటకు, ఆహ్వానించుట కొరవితో తలగోకికొన్నట్లగుతుంది, పిట్ట పిట్ట తగవు పిల్లితీర్చినట్లగుతుంది పర్యవసానము!

అం:-ఈ ధర్మోపన్యాసములు, సామెతలు వల్లింపనవసరము లేదు.

ధర్మ:-అవును! సామెతలెందుకు, పరాయివానికి మన ఇంటిలో ఆ మెతలు ఇచ్చుటకు సంసిద్ధుడవుకదూ? అన్నాయ్! ఆవేశంతో అనరాని మాటలను అనినాను. క్షమించు. కాని ఆ వేశాలనుజ్జగించి, నా ఆశయము ఆలకించు...

[అంభి త్వరత్వరగా గదిని వదలిపోవుచుండ, ధర్మశీల గుమ్మమున కడ్డముగ వచ్చును]

అం:-ధర్మా! దారితొలుగు.

ధర్మ:—విను అన్నాయ్. ఈ చెల్లెలు, నీ శ్రేయోభిలాషి మాటవిను... పురుషోత్తమునిపైగల పగకై, మన భారతావనికే ద్రోహం తలపెట్టెదవా ...

అం:—ధర్మా ! దయయుంచి నన్ను విడువుమమ్మా !

ధర్మ:—దయయుంచి నామాట వినుమన్నా ! చూడు ! పురుషోత్తముడు మున్నగువారు, ఐక్యముగ సంఘటించి, అలెగ్జాండర్‌ను ప్రతిఘటించుటకు కత్తులు నూరుచుండ, నీవు వానిని దొడ్డిదారిగుండ లోనికి పిల్చుకొని రా ప్రయత్నిస్తున్నావ్ ! సిగ్గుచేటు ! నీ పొరుగు రాజులలో మరల తల ఎత్తుకొని తిరుగ గలవా ?

అం:—ఊరకుండుకోలది నోటికోలది ప్రేలుతున్నావ్ ! (ఉద్రేకంతో) చెప్పు ! మనము వ్యక్తిగతంగా అలెగ్జాండర్‌ను ఎదిరించుటచే సైన్యనష్టమేగాని, వేరొక ఫలితమున్నదా !

ధర్మ:—ఐక్యత ... ! గడ్డిపరకలు చేరి మదగజమును బంధిస్తుళ్ళేదూ !

అం:—భళె ! మనలనొకపరి, పరాభవించిన ఆ పురుషోత్తమునితో పొత్తు చేసికొమనుచున్నావ్ ! ఈ మాటలనుటకు నీ నాలుక ఎట్లాడుచున్నది. నీవొక శ్రేయోభిలాషివా ! నీ అన్న మానము నిలుపుటకు ఇచ్ఛగించుచున్నావా ? ఆ పురుషాధమునిపై పగ సాధించుటకు వేయిమంది అలెగ్జాండరులనైనా ఆహ్వానిస్తున్నాను ... మాట మీరిన - ఇదే నా ప్రతిజ్ఞ !

ధర్మ:—(కోపముతో వణకుచు) ప్రతిజ్ఞ ! ... దేనికి నీ ప్రతిజ్ఞ ! క్షీరాన్ని ఒసంగి, స్వర్గాన్ని బురడించిన నీ తల్లిరొమ్మును పడతన్నుటకా ? పగ ... పగసాధించుట ! భళెభళె ! భళిసాహసము చేస్తున్నావన్నాయ్ ! కాని ఈ సమయములో, ఆ పురుషాధముడని నీవు ప్రేలుచుంటావే, ఆ పురుషోత్తముడే, నిజముగా పురుషోత్తముడు. తన తల్లిభూమిపై కాలికొకచుట్టి, శత్రువులను ఎదిరించి, తన రక్తాన్ని ధారపోయుటకు సిద్ధముగానున్నాడు. ఇకనీవా అధమునివలె ...

అం:—ధర్మా ! మితిమీరుచున్నావ్ ! జాగ్రత్త !

ధర్మ:—(శాంతముగ) అన్నాయి ! నామాట వినవూ ! పరులను పగలు తీర్చుకొనుటకు, ఆహ్వానించుట పొరపాటు ... ఇది సర్వకాలములలోను ముప్పనకు దారితీస్తుంది. లే ! సైన్యాన్ని కూర్చు - కాలికొకజుట్టు. యుద్ధభేరి మ్రోగించు-అందరిరాజులతోపాటు నీవొక రాజుగ, భారతీయ వీరునిగా, తలఎత్తి హోరాహోరిగా పోట్లాడు. నీ దివ్యనామాన్ని, భారతీయ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించుకో !

అం:—ధర్మా ! అంభి ఆలోచన, ఆచరణ ఒకటే ! అందులో నీవు అనవసరముగ జోక్యము కల్పించుకొనినందున, అలెగ్జాండర్‌ను తప్పక ఆహ్వానించి తీరుతాను.

ధర్మ:—(కోపము పట్టలేక) నోర్ మూయ్ !

అం:—(ఆశ్చర్యంతో) ఆ !

ధర్మ:—ఆ ! నీవొక అన్నవా ? చెమిటి వానికి శంఖమూదినట్లే! ఇన్ని అనుచున్నను, నయముగ, భయముగ చెప్పినను, నీలో ఉత్తేజం రగులుటలేదూ ! నీలో క్షాత్రరక్తంలేదూ ! నీవు పుట్టినది వీరభూమియగు భరతభూమిలోనేనా ? (మొలనుండి చిన్న కత్తి తీస్తూ) నిన్ను పొడిచివేసినా తప్పులేదు. తన కన్నతల్లికే చెఱుపునుగోరు ద్రోహిని చంపినను పాపంలేదు ... కానీ సంఘపు దృష్టిలో నీకు నాకు అన్నా-చెల్లెలను సంబంధము కలదు... నేనే నిన్ను చంపగలను. (అంభి బలాత్కారముగ కత్తిని లాగివేయును) నేను భారత దేశములో పుట్టిన వీరనారిని. నాలో క్షాత్రరక్తము లేకపోలేదు. నీవొక పులికడుపున బుట్టిన 'మేక'వు... ఇప్పుడు కాకపోయినను, రేపు అలెగ్జాండరే నిన్ను త్రొక్కివేయుట తథ్యము.

అం:—(చప్పట్లు చరుస్తూ) ఎవరక్కడ ?

ధర్మ:—(నవ్వుతూ) ఖైదీగా పట్టియుంచుతావ్ ! నేను ముందే జాగ్రత్త తీసికొనినాను లే! ప్రక్కనెవరూ లేరు... ఇదిగో నేను పోవుచున్నాను ... నీబోటి మూర్ఖునకు చెప్పటకన్నను, పసరానికి బోధింప వచ్చు. ఇదిగో! నీవు దేనిని గోప్యముగ దాచ ప్రయత్నిస్తున్నావో, దానిని లోకానికి చాటుతాను. అందరినిరేగొట్టి, ఆ అలెగ్జాండర్ ను ఓడించి తీరుతాను. కడకు నిన్నూ...

అం:—ధర్మా ! తిన్న యింటివాసాలే లెక్కపెట్టుతావ్ !

ధర్మ:—అన్నా ! ఛీ! ఛీ! మాతలకు మాత దేశమాతనే కాలరాయజూచు నీవా నాకు అన్నవు !

అం:—ఛీ ! పో ! సిగ్గరి !

ధర్మ:—ఇక శాంతి నాలో లేదు ... ఈ ధర్మశీల ధర్మవిజయానికై పాటుపడుతున్నది. నీవుకాదు: ఒక పురుషోత్తముని వీరరక్తపు బొట్టునకు వేయి మంది అలెగ్జాండరులు సరిగారు. ఇదిగో! నేనే పోయి పురుషోత్తమునకు నీ కుతంత్రాన్ని వెలిబుచ్చుతాను. (పోబోవును)

అం:—ధర్మా ! ఆగు.

ధర్మ:—ఆగను! ఇటువంటి దేశద్రోహి ఇంటిలో క్షణముండిన, క్షయమునకే దారితీస్తుంది ... హాయిగ దేశములోని ప్రజానీకములో నొకతెనై, నా దేశము కోసము చివరి రక్తపుబొట్టు చిందేవరకు పాటుబడతాను ! శెలవు !

[అని తెరలోనికి బోవును]

అం:—ధర్మా ! ఆగవూ !

ధర్మ:—ఆగను! ఇదిగో పురుషోత్తముని దగ్గరకు పోవుచున్నాను.

అం:—అసంభవం !

ధర్మ:—పిరికిపందవలె నేను నీవలె పరులకు దాసోహ మనను. భారతనారిగా నావిధ్యుక్తధర్మాన్ని నెఱవేర్చుటకు, పోవుచున్నాను.

అం:—జాగ్రత్త ధర్మా ! కాలు కదిపితివా ! ఆ.. గ...వూ... ?

ధర్మా:—ఆ...గ...ను...!

అం భి:—ఇ...ది...గో... (అని కత్తి విసరివేయును)

[తెరలో ' ఆబ్బా ' అనును...]

(ధర్మశీల వీరనారివలె అంతిమ వాయువు పీల్చినది.)

[తెర వ్రాలును]

పాత్రుడుగారి
బాలసంజీవిని (Regd)
పిల్లల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులను నివారించును
డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్,
19, దక్షిణ మాడవీధి, మైలాపూరు, మదరాసు—4. Phone 85254.
కుంభకోణము బ్రాంచి : 1. సారంగపాణి కోవిల, తూర్పువీధి.
అన్ని మందుల షాపులలోను దొరకును.

# పార్వతి యౌవనము

శ్రీ చింతగుంట సుబ్బారావు



పుష్పధన్వు చేతి పువుకాని యస్త్రమై,
పెట్టని తొడవౌచు మేనికపుడు,
మద్యమనగరాని మదనసాధనమౌచు,
పార్వతికిని వచ్చె యౌవనంబు.

చల్వకై శశిఁ జేరి చెంగల్వ లేక,
చల్వ లేమిని కల్వలో నిల్వలేక,
చల్వ కల్వల నెలవగు చెల్వలోన
చెల్వ హరిచెల్వ హరుచెల్వ చేరినిలచె.

వన్నె దిద్దిన చిత్రము వలెను మేను
వికసితాబ్జము వోలెఁ బ్రవిమలమయ్యె,
హెచ్చుతగ్గులు లేక శోభిల్లెఁ నెల్ల
యౌవనప్రాప్తిఁ జేసి యాతివ వపుష.

రాగరేఖలఁ జిమ్ముచు రాజియౌచు,
ఉన్నతాఙ్గుష్ఠ నఖరేఖ యువిద నడవ,
మెట్టుచు భువి చరించెడు మెట్టతామ
రలను శంక కలుగుఁ నంతరంగమునను.

ప్రత్యుపదేశలుబ్ధలయి పార్వతి నడ్వగఁ
నామెనుండి తా
మత్యనుపమ్ము నూపురరవమ్ముల నేర్వగ.
రాజహంసలే

ప్రత్యుపదేశసాధనకు పార్వతికిన్ నిజ
మందయానమున్
ప్రత్యుపదేశ మిచ్చినటు ప్రాపువహించు
ఝళంఝళావళుల్.

కర్కశత్వము కల్గుట గజకరంబు,
శీతలంబున కదళీవిశేషములును,
జగతిఁ నుపమానములుగ ప్రశస్తివడసి
అయ్యెఁ నుపమానబాహ్యముల్ హైమ
వతికి.

నాతి దీర్ఘములయి గుండ్రనై తనరుచు
సుదతి జఙ్ఘయుగళి తోఁచు చూపరకును
జఙ్ఘ నిర్మాణమందున జలజభవుఁడు
చెంతఁ గలయట్టి లావణ్యమంతఁ నిడెనొ!

పేద యయ్యె యజ్ఞవేది పోలిక కాను;
పైఁ వళిత్రయంబుఁ వడియెఁనంత,
మీనకేతను కొలకు మెట్లులట్లు
కట్టెనో యెలప్రాయ మట్టులనగ!

పాండు వర్ణములయి పార్వతిపాలిండ్లు
ఒండొకట్టిని కడకుఁ నొత్తుకొంచు
నెడములేక నల్లని మొనలతోడుత,
కలువకనులకన్నె కనులవిందు.

సుమశరము ధరించి, సూనశరుని హరింప,
బంధించె తన కరపల్లవమున !
తన కంఠమందు ముత్యాలసర మునిచి
పోషించె భూషణ భూష్యసరళి !
మధురభాషలచేత మరపించె పార్వతి
కోకిలకొమరాలి కూజితంబు !
బెదరుచూపులబాల బెదరుచూపుల నేర్పె
హరిణాళికనిశంకయగుఁ నెడంద !
మన్మధుండు చాపమదమును వీడె
కనుబొమఁ గని చాల కలతఁజెంది !
మొల్లత లతను పోలి మించె పూతచరిత,
సతతలలితహృదయ శంభురాణి !

[మహాకవి కాళిదాసు రచించిన “కుమార సంభ
వ”మునందలి పార్వతీ యౌవన వర్ణనమునకు స్వేచ్ఛాను
వాదము.]

ఒక గ్రామవాసి స్టేషను మాస్టరును “బెజవాడ పోయేబండి ఎప్పుడు వస్తుందండీ !”
“పన్నెండు గంటలకు”
“దానికివతల మరొకబండి లేదా”
“ఇవతల, అవతల బండ్లునడువవు”




సేవాడుడు

శ్రీ పాదకృష్ణమూర్తిశాస్త్రీ అండ్ సన్స్
రాజమండ్రి

స్త్రీల రోగ నివారిణి

| | |
|---|---|
| ఋతుశూల | హిస్టీరియా |
| మైల సరిగా కాకుండుట | శరీరము లావుబారుట |
| మైల అధికముగ వెడలుట | ఆయాసము |
| సంతానము లేకుండుట | తిమ్మిర్లు |
| శ్వేత ప్రదరము | జీర్ణము |
| రక్త ప్రదరము | ఆకలి సరిగా లేకపోవుట |

మొదలగువానికి వరప్రసాదిని
తులం 1 కి రు. 4-0-0

★

Or 10 గణపతి మొదలివీధి,
రాయపేట. మద్రాసు-14




శ్రీమతి శ్రీధర జయలక్ష్మీదేవి

సాయంకాలము నాలుగున్నర అయేసరికి లేడి పిల్లలాగ చెంగున యిల్లుచేరుకున్నది లక్ష్మి. గబగబ నీళ్ళ గదిలోకివెళ్ళి కాళ్ళు, చేతులు, ముఖము కడుక్కొని తువాలుతో తుడుచుకుంటూ "వదినా! వదినా పేరంటానికి వెళదామంటివే – జడ వెయ్యవూ" అన్నది లక్ష్మి. శాంత ఆమెచెక్కిళ్ళను ముద్దాడుతూ "ఎక్కడికైనా వెళ్ళుతమంటె నీకు ఆకలి దప్పులుకూడ యుండవు——ముందుపోయి ఆ బల్లమీద పెట్టియున్న టిఫెనుతిని కాఫీ త్రాగిరా" అన్నది. ఆరుగంటలయేసరికల్లా వదినె, మరదళ్ళు తలలుదువ్వుకొని చక్కగా ముస్తాబై పేరంటానికి బయలుదేరపోతుండగా మూర్తి ఆఫీసునుండి యింటికివచ్చాడు.

"ఎక్కడికి శాంతా! బయలుదేరారు? —ఓహో పేరంటానికి కాబోలు!" అంటూ లక్ష్మి రెక్కల క్రింద చేతులుంచి పట్టుకొని గిరగిర నాలుగుచుట్లు త్రిప్పి బొమ్మను కూర్చోపెట్టినట్లు లక్ష్మిని కూర్చోపెట్టాడు.

నలిగిపోయిన పూలను, రేగినజుట్టును సవరించుకుంటూ "పోఅన్నయ్యా !— నాపూలన్నీ ఎలా రాలిపోయినవో చూడు !— నీ వెప్పుడూ యింతే" నంటూ బుంగమూతి పెట్టింది.

"అవును చిట్టీ— మీ అన్నయ్యకు యింటికివచ్చేసరికి ఆటలెక్కువైపోతాయి — ఇంట్లో యున్న కొంచెముసేపు నీతోటి, మురళితోటి ఆడుకోడం తప్ప మరేగొడవ పట్టదు" అంటూ మూర్తితో "ఏమండీ! అబ్బాయికి పాలడబ్బా యివ్వాళకూడ తేలేదు కదూ !"—

"అరరే...యిప్పుడు వెళ్ళి తెస్తాను" అని మూర్తి బయలుదేరపోబోయాడు.

శాంత అతనిని ఆపి "పోనీలెండి రేపుతేవచ్చు— బల్లమీద కాఫీ, ఫలహారం యున్నవి. మేము ప్లీడరుగారి యింటికి పేరంటానికి వెళ్ళివస్తాము—యిప్పటికే చాల ఆలస్యమయింది" అని వదినె మరదళ్లు వెళ్లిపోయారు.

మూర్తికి నూరు రూపాయలు జీతం. దాంతో మద్రాసునగరంలో కాపురం గడవడమంటే నలుగురు గల సంసారంలో ఎన్నెన్నో కష్టాలను, సమస్యల నెదుర్కొంటూ జీవయాత్ర సాగిస్తున్నారు. కాని శాంత విద్యాధికురాలు కాకపోయినా ఉత్తమ గృహిణి కావడం గొప్ప అదృష్టము. కష్టాలను సుఖాలను సమానంగాచూస్తూ తన భర్తకు, చిట్టిమరదలికి సాధ్యమైనంతవరకు మనసు నొవ్వకుండా ఉన్నంతలో కుటుంబాన్ని గంభీరంగా నడ్పుకొని వచ్చేది.

లక్ష్మి, మురళి ఆడుతూ పాడుతూయుంటే ఆ దంపతులిద్దరు ఆనంద సౌభాగ్యాలతో దుఃఖాలనూ కష్టాలను మరిచిపోతుండేవారు.

ఒకరోజున బళ్ళోనుంచి రాంగానే లక్ష్మి శాంత దగ్గరకు పరుగెత్తి "వదినా నిన్నొకటి అడుగదలచుకున్నాను..."

"ఒకటేమిటి—పది అడుగు—నీకేంకావాలి"?

"వదినా! నాకు తల్లిలేదూ?!"

"ఎవరన్నారమ్మా నీకు తల్లిలేదని! — నేనేగా నీకు తల్లిని."

"నాకు తెలుసులే—మా అమ్మ చనిపోయింది— నీవు వదినెవు"

"పిచ్చిపిల్లా! దేవుడు నాకిచ్చి నిన్ను, యీ అమ్మాయికి తల్లివి, వదినెవు అంతా 'నీవే' నని చెప్పాడు. అప్పటినుండి నిన్ను నేను పెంచుతుంటే నీవు నన్ను 'వదినె' అని పిలుస్తున్నావు" అనిచెప్తావుంటే శాంత తన కండ్లనుండే రాలే నీళ్ళబొట్లు లక్ష్మి చూడకుండాయుండేందుకని తల మరొక వైపుకు త్రిప్పుకొని "చిట్టీ! పోయి మురళి రోడ్డుమీదికి వెళ్ళాడేమో చూడు — బండ్లు వస్తుంటాయి" అనేసరికి లక్ష్మి లేచి వెళ్ళగానే పమిటకొంగుతో కండ్లు తుడుచుకుంది. ఇలాగే లక్ష్మి అనేకసార్లు అడిగినప్పుడల్లా యదార్థం చెప్పితే పసి హృదయం బాధపడుతుందని అసలు విషయం చెప్పకుండా మరపిస్తుండేది.

ఒకనాడు భోజనాలదగ్గర మాటల ప్రస్తావనలో ఎదురుగా గోడకు తగిలించియున్న తల్లిఫోటోను చూస్తూ "శాంతా! మా అమ్మ చనిపోయి యీ జన వరికి అప్పుడే మూడేళ్ళు నిండుతాయి. ఆమెయుండియుంటే మురళిని క్రింద దించుతుండేదేనా" అన్నాడు.

శాంత విచారంగా "నా దురదృష్ట మటువంటిది - నేను వచ్చి రాకముందే ఆమెను పంపేశాను" అన్నది.

ఈ మాటలు వింటున్న లక్ష్మికి ఏమి బోధపడకపోయినా బిక్క మొగముతో వాళ్ళతో పాటు కూర్చున్నది. ఉన్నట్లుండి "వదినా! — నీవు నాకు అమ్మవు — వదినెవు అవుతావు కదూ! — అయితే మా అన్నయ్యకు కూడ అంతేనా" అన్నది.

"కాదుచిట్టీ ... ఆ ...ఆ... అంతే" నంటూ లక్ష్మి అమాయకత్వానికి తనలో తాను నవ్వుకున్నది.

మూర్తి "మీ వదినె నీకు, నాకు ప్రపంచానికంతా తల్లేలే! నీవు వెళ్ళి పండుకో" అన్నాడు లక్ష్మితో.

శాంత చిచ్చుకొడుతుంటే మురళి, వాడితోబాటు లక్ష్మి నిద్రపోయారు.

"ఇక లక్ష్మిదగ్గర ఏ గుట్టు దాగేటట్టులేదు. ఇంకా ఆరేళ్లు నిండలేదు-ఎంత ఊహ, తెలివితేటలండీ!"

"చిట్టి అంతా మా అమ్మపోలిక శాంతా! — పోలికలతోబాటు ఊహాపోహాలుకూడ ఆమెవే. మా అమ్మకు 10 ఏళ్ళప్పుడు పెండ్లి అయిందట. అప్పటి ఫొటో మా తాతగారియింట్లోయుంది. దాన్నిచూస్తే చిట్టిని చూడనక్కరలేదు."

"మనచిట్టికి అప్పుడే పెళ్ళిచెయ్యవద్దండీ! — పెద్ద చదువు చెప్పించి, దాంతోబాటు సంగీతం నేర్పాలి. తర్వాత దానికి నచ్చిన సంబంధముతెచ్చి వివాహం చెయ్యాలి. అంతేకాని అభంశుభం ఎరుగకుండా

"పెండ్లిచేయడం నాకు సుతరాం యిష్టంలేదు" అన్నది శాంత.

"అబ్బో! ... పెద్ద ఎత్తులే ... మన స్థితికి, మనమిచ్చే కట్నానికి ఏరికోరి అల్లుణ్ణి తేగలమా! – దాని పెళ్ళియీడు వచ్చేసరికి యిన్సూరెన్సుబాపతు రెండువేల రూపాయలుతప్ప మరేమి యుండదు. మనము యిప్పుడు అసలే చాలీచాలని సంపాదనతో నెలకు 20, 30 రూపాయలయినా అప్పుజేయకుండా సంసారం గడువడంలేదు. ఇక మనము నిలువచేయకలిగేది శూన్యమన్న సంగతి తెలిసినదే" అన్నాడు మూర్తి.

"ఏమోలెండి! ... దాని అదృష్టం బాగుంటే మీకేవిధంగానైనా డబ్బురాగూడదా – చిట్టికి కోరిన వరుడు దొరకకూడదా" అన్నది శాంత. ఇలా మాట్లాడుకుంటూ నిద్ర పట్టించారు భార్యాభర్తలు.

లక్ష్మి నిద్రనుండి ఉలిక్కిపడిలేచి "వదినా! భయంగాఉంది" అంటూ తట్టిలేపింది.

శాంత లేచి "భయమెందుకు చిట్టీ! నేను నీ దగ్గరే పండుకున్నానుగా" అంటూ పైన చెయ్యివేసి పండుకుంది.

* * *

"ఏమండీ! రేపు చిట్టి పుట్టినరోజు – జ్ఞాపకముందా" అన్నది శాంత.

"అయితే ఏమిటంటావు? – యిప్పుడా నెలచివరి రోజులు – చేతిలో చిల్లిగవ్వయినా లేదని నీకు తెలియదా శాంతా!" అన్నాడు మూర్తి.

"బాగుంది – మనకెప్పుడూ యున్నవే యీ గొడవలు – పదండి వెళ్లివద్దాము" అన్నది శాంత.

మూర్తికి అదంతా అయోమయంగానున్నది. మారు మాట్లాడకుండా శాంతతోబాటు నగల దుకాణంలోకి వెళ్ళాడు. తన మెళ్లో మూడుపేటల గొలుసు షరాబు చేతికిచ్చి తూకం వెయ్యమన్నది. ఆ దుకాణం నాలుగుమూలలు కలయతిరిగి మామిడిపిందెల నెక్లెస్ ఒకటి, ఒకజతగాజులు తీయించి తూకంవేయమన్నది.

ఇదంతా చూస్తున్న మూర్తి విస్తుబోయి "ఏంపని శాంతా! యిది – నేను అదనంగా నీకు నగలు చేయించేది లేకపోగా ఉన్నదానిని..." అన్నాడు.

"అదేమిటండీ! అలాగంటారు-మీకు తెలియదు;" మీరూరిక చూస్తూ నిలబడియుండండి! తర్వాత యింటిదగ్గర సావధానంగా మాట్లాడుకుందాము" అన్నది శాంత.

షరాబు తూకంవేసి "మీ గొలుసుకు యీ నెక్లెస్, గాజులు మారకంవేస్తే మీ చేతికి రు 50 లు వస్తవి" అన్నాడు.

"చూశారూ! ఒక్కనగకు బదులుగా రెండు నగలను ఏర్పరచాను; పైగా రేపు చిట్టి పుట్టినరోజు పండుగ దర్జాగా జరుపకల్గుతాము" అన్నది మూర్తిని చూస్తూ.

నగలకొట్టు యజమాని గాజులను, నెక్లెస్‌ను పెట్టెలలో పెట్టి మాచేతికిచ్చి, రూపాయలు 50 కూడ యిచ్చాడు. వానిని తీసికొని యిల్లుచేరాము.

మరునాడు చిట్టికి తలంటి నీళ్ళుపోసి, కుట్టించిన సిల్కుపరికిణి, జాకెట్టు తొడిగి, మామిడిపిందెల నెక్లెస్‌పెట్టి "ప్లీడరుగారి అమ్మాయికుందనీ, నీకు కూడ కావాలని అంటుంటివే – యిప్పుడు సంతోషమే కదూ" అన్నది. లక్ష్మి ఉబ్బి తబ్బిబ్బైనది. దర్జాగా లక్ష్మి పుట్టినరోజు పండుగ గడచిపోయింది.

లక్ష్మి మెళ్ళోని నెక్లెస్ చూచి "శాంత మహాయిల్లాలు! తన భర్తయొక్క కొద్ది ఆదాయంతో ఎంత పొదుపరితనంగా కుటుంబం జరిపితే బంగారం కొని నగలు చేయించకలుగుతుంది! – పాపం లక్ష్మికి తల్లి లేనిలోటు లేకుండా చూచుకొంటున్నది" అనుకొనేవారు యిరుగుపొరుగువారు.

దరిమిలా శాంతకు మరిద్దరు కుమారులు పుట్టినా లక్ష్మిమీద ప్రేమానురాగాలు తగ్గలేదు. లక్ష్మి 14వ ఏట స్కూలు ఫైనలు చదువుతుండేది. శాంతకుమాత్రం ఏలాగైనా లక్ష్మికి గొప్పసంబంధము మాట్లాడి పెండ్లి చేయాలని. కాని మూర్తి తన స్థిమితాన్ని మించిన శాంత పిచ్చిపిచ్చి పోకడలు ఒక్కొక్కప్పుడు చాల చీకాకు కలిగించేవి.

ఒకరోజున సాయంకాలం మూర్తి యింటికి రాగానే "ఏమండీ! పెళ్లిచేసిచూడు సినిమాకు వెళదామండీ" అన్నది.

లక్ష్మి అందుకొని "వదినెకు ఎప్పుడూ పెళ్ళి ముచ్చటే" అన్నది.

"మీ వదినె పల్లెపడుచుకదూ – చిట్టీ! – అంతకంటె మరింకేమి తెలుసు–ఎప్పుడూ పెళ్లిళ్లు, వ్రతాలు, నోములు, పప్పన్నాలు – పిల్లల్ని పెంచడం! – పట్నవాసం కాపురంకదాయనే అదురు, బెదురూ కూడ లేదు"

"ఏమిటండీ! అలాగంటారు–సినిమాకెళ్ళి ఆరు నెలలయిందికదా – యీ కాలంలో ఏడాదికి రెండు సినిమాలనైనా చూడకుండా కడకు మూడుకాళ్ళ ముసలమ్మలుకూడ యుండరు – పోనీ యిష్టంలేకపోతే యీ అనవసరపు ఖర్చు ఎందుకనరాదూ."

"నేను సినిమాకు రానువదినా! పరీక్షలు దగ్గరకు వస్తున్నవి - చదువుకోవాలి. పరీక్షలయ్యాక డాన్సు ప్రదర్శనానికి వెళ్తాను" అన్నది లక్ష్మి.

"బలేబాగుంది - మీ రిద్దరు యీ సంసారానికి దాపరించినందుకనుకోవాలి!-డాన్సు లేదు గీన్సు లేదు. పోయి చదువుకో" అని గద్దించి మాట్లాడాడు మూర్తి.

లక్ష్మి గుడ్లనీరు గుడ్ల కుక్కుకుంటుంటే శాంతవచ్చి "చిట్టీ! మీ అన్నయ్య మాటలకేంలే - నేను పంపిస్తానుగా డాన్సుకు" అంటూ బుజ్జగించి వెళ్లిపోయింది.

అన్నయ్య చాలీ, చాలని ఆదాయంతో పడుతున్న యిబ్బందులు కష్టాలను చూస్తుండినది కాబట్టి అన్నయ్య కసిరినా బాధ అనిపించలేదు. అప్పటి నుండి తను అది కావాలి, యిది కావాలని తొందర చేయడం పొరబాటనే నిర్ణయానికి వచ్చింది.

కట్నకానుకలా యివ్వగలస్థిమితమూ లేదు. కాని శాంతకు మాత్రం లక్ష్మిని విద్యాధికుడు, రూపసి, సుఖున్నకుటుంబమువాడైన వరుని మాట్లాడి పెళ్ళి చేయాలని. మూర్తి నెత్తిన నోరు పెట్టుకొని యివన్నీ 'అందని మానిపండ్లని' శాంతకు చెప్పి చూచాడు. కాని ఆరునూరైనా, నూరు ఆరైనా తన పంతం నెగ్గించుకోవాలని కూర్చున్నది శాంత.

పరీక్షలయిపోయినవి. శాంత 15 రూపాయలు తెచ్చియిచ్చి "లక్ష్మి! తీసికొని డాన్సు చూడడాని కెళ్ళిరామ్మా" అన్నది.

"ఎంత పిచ్చిదానివి వదినా! నేనొక్కతెనే 10 రూపాయలు ఖర్చుపెట్టి డాన్సు చూడ్డానికెళ్తానా!- నేనూరికేనే అడిగానుకాని - సరేకాని రాత్రికి బియ్యంలేవుకదా నీవు యీ 15 రూపాయలు ఎక్కడ నుండి తెచ్చావు" అన్నది.

శాంత ఏమి మాట్లాడలేదు.

"ప్రక్కయింటి లక్ష్మమ్మ దగ్గర తెచ్చావు కదూ! -"

"అవును బదులడిగి యిప్పించుకొని వచ్చాను. మొదటి తారీఖున తిరిగి యిచ్చేస్తే సరిపోతుంది" అన్నది.

"చాల బాగుంది" అని వదినె చేతిలోని 15 రూపాయలు తీసికొని పారిపోయి పొరుగింటి లక్ష్మమ్మకిచ్చి వచ్చింది.

తన పెండ్లిని గురించి వదినె పడుతున్న ఆరాటం, అన్నయ్య పడుతున్న చీకాకు అనుదినం గమనిస్తూనే యున్నది లక్ష్మి. మూర్తి గంతకు తగిన బొంతగా

తీసికొని వచ్చిన రెండు మూడు సంబంధాలను తిరుగ గొట్టేసింది.

ఆ రోజున ప్లీడరుగారి అమ్మాయికి వివాహ సంబంధము వచ్చింది. పిల్లను చూడడానికని తల్లి దండ్రులు, కానున్న వరుడు వచ్చారు. లక్ష్మినికూడ చూడడానికి రమ్మని తీసికొని వెళ్ళారు. వచ్చినవాళ్ళు కానున్న వధువును, వెంబడియున్న లక్ష్మినిచూచి మిగిలిన విషయాలను తర్వాత మాట్లాడుకుందామని చెప్పి వెళ్ళిపోయారు. తర్వాత వారం రోజులకు ప్లీడరుగారికి "మీ పెద్దమ్మాయికంటె ఆమె వెంబడి యుండిన చిన్నమ్మాయి మాకు నచ్చింది. ఆమెను మా అబ్బాయి కిచ్చేట్లయితే చేసికుంటాము" అని జాబు వ్రాశారు.

అది చూచేసరికి ప్లీడరుగారు నిర్విణ్ణుడైనాడు. అయినా చేసేదిలేక మూర్తికి ఆ విషయం తెలియజేశాడు. అదివిని శాంత ఉప్పొంగిపోయింది. కాని ఆ సంబంధమా గొప్పది - కట్నకానుకలా అలివి మాలినవి. మూర్తికి ఏమిచేయడానికి తోచలేదు. శాంత మాత్రం తన అన్నగారి యూరికి వెళ్ళివస్తానని బయలుదేరి వెళ్ళింది.

తనకు తండ్రి వ్రాసి యిచ్చిన నాలుగెకరాల పొలమును అన్ననే తీసికొని 10 వేల రూపాయ లివ్వవలసినదిగా ప్రాధేయపడింది. అన్న ఎంతో చెప్పి చూచాడుకాని పట్టువదలలేదు. సరేనని పదివేల రూపాయలివ్వడానికి అంగీకరించారు.

సంబంధము నిశ్చయముచేసికొని రమ్మని మూర్తిని పంపింది. 10 వేల రూపాయల కట్న కానుకల తోటి, యిన్సూరెన్సు బాపతువచ్చిన 2 వేల రూపాయల చిల్లరతోటి లక్ష్మి పెండ్లి వైభవంగా జరిగింది. లక్ష్మికి ఏకొరతలేకుండా అత్తగారి యింటికి పంపబడింది.

లక్ష్మి అత్తింటివాళ్లు గొప్ప స్థిమితం కలవారైనా క్రమేణా లక్ష్మి పుట్టింటివారు దరిద్రులని, నడతలు, లాంఛనాలు సరిగ్గా జరుగలేదని దెప్పసాగారు. లక్ష్మి యీ బాధను దినదినానికి భరించలేకపోయేది. ఈ విషయం అన్నయ్యకు జాబు వ్రాసింది. తన స్థిమితానికి మించినవారితో సంబంధ బాంధవ్యాలు చేసినందుకు చాల విచారపడ్డాడు. శాంత కుంగి క్రుశించిపోసాగింది. తనుపోయి చూచివద్దామనుకొంటుండగానే మూర్తివేసిన పజిలులో, మొదటి బహుమానం యిరవై వేల రూపాయలు వచ్చినట్లు టెలిగ్రాం వచ్చింది. ఆ దంపతులకిక ఆనందానికి మేరలేదు.

లక్ష్మికి ఆ విషయాన్ని తెలియజేసి అనుకున్నదానికంటె ఎక్కువగా, ఘనంగా లాంఛనాలు, నడతలు జరుపగలమని గర్వపడ్డారు. లక్ష్మి ఆనందమే తన ఆనందముగా ఎంచిన శాంత ఆమెకు ఏకొరత లేకుండా తను, తన సంసారము సుఖంగా కాలక్షేపం చేయసాగింది.

—(౦)—

ఒక నౌకా శిక్షణాలయంలో తర్ఫీదు పొందుతున్న బాలుని ఒక వృద్ధ నౌకాదళాధిపతి "పెద్ద తుపానువస్తే ఏమిచేస్తావు" అని అడిగాడు.

"వెంటనే లంగరు వేస్తాను."

"ఇంకొక తుపాను వస్తేనో"

"మరొక లంగరు వేస్తాను."

"అయితే భయంకరమైన మరొక తుపాను చెలరేగితేనో"

"విశేషమేముందీ - మళ్లీ లంగరువేస్తాను."

"ఆపు - ఇన్ని లంగర్లు ఎక్కడినుండి తెస్తావు?"

"ఇన్ని తుపానులను మీ రెక్కడినుండి తేగలిగారో లంగర్లనుకూడ అక్కడినుండే"




సీరియల్ :

# వీరబాల

అనేక సంవత్సరాలకు పూర్వం సుందరపురిని రాజధానిగా సాధుసింహుడనే రాజు రాజ్యం పాలిస్తూ వుండేవాడు. అతనికి చాలా కాలంవరకూ పిల్లలు కలుగలేదు. చివరికి త్రిపురసుందరి దయవల్ల ఒక కుమార్తె కలిగింది. ఆమె పేరే బాలసుందరి. బాలసుందరిని రాజదంపతులెంతో 'అల్లారు ముద్దుగా పెంచుకొంటున్నారు.

బాలసుందరికి ఐదో యేడు రాగానే అక్షరాభ్యాసం చేశారు. సుందరి అన్ని విద్యల్లో ఆరితేరతోంది. ఆమె రోజూ దాసీలతోనూ, మిత్రులతో ఉద్యానవనంలో ఆడుకొంటూ వుండేది.

ఒకరోజు మామూలుగా సుందరి తన స్నేహితురాండ్రతో ఆడుకొంటూ వుండగా ఒక క్రొత్త అమ్మాయివచ్చి అంది "సుందరీ! నీతో నేనుకూడ ఆడుకోవచ్చా? — నాకు చాలా ఆటలొచ్చు. కావలిస్తే నీక్కూడా నేర్పుతాను."

బాలసుందరి "ఓ...! — మరి నీపేరేమిటి?" అని ప్రశ్నించింది. అందుకా అమ్మాయి కొంచెంసేపు ఆలోచించి "నాపేరా?... నాపేరు ఉమాదేవి." ప్రతిరోజూ సుందరి — ఉమాదేవులు ఆడుకొంటూండేవారు. సుందరికి, ఉమఅంటే అమితప్రేమ. ఉమలేనిదే ఒక్క క్షణంకూడా వుండలేకపోయేది సుందరి.

ఒక రోజున అంతాకలిసి ఆడుకొంటూ వుండగా సుందరి అంది "ఉమా! ఒక కథ చెప్పవూ?" ఉమాదేవి కథచెప్పడం ప్రారంభించింది.

'సుందరీ! శ్రద్ధగావిను. ఈ కథ ఒక వీరమాతది! చాలాకాలం క్రిందట ఒక రాజ్యాన్ని ఒకరాజు పాలిస్తూ వుండేవాడు. ఆ రాజు చాలా మంచివాడు. ఆయన తన రాజ్యంలో ఎవరికీ అన్యాయం జరగనిచ్చేవాడు కాదు. ఇలా వుండగా పాపం! ఆ రాజ్యం మీదకి ఒక దుర్మార్గుడు దండెత్తి వచ్చేడు. వాడు హఠాత్తుగా వచ్చేడు కదూ! — వీళ్ళ సైన్యం సరిగా లేదు. ఆ దుర్మార్గుడు ఆ రాజ్యాన్ని ఆక్రమించుకోసాగాడు.' సుందరి ఉమాదేవివైపు చూస్తూ వింటోంది.

'ఆ రాజ్యంలోనే ఒక ఆమె వుంది. ఆవిడకు ఐదుగురు కొడుకులు. ఆమెకి భర్తలేదు. పొద్దల్లా కష్టపడి పనిచేసి ఐదుగురు కొడుకులను పెంచింది. ఆమె యుద్ధంరాగానే రాజ్యంలోని వారందర్కీ నీతులు బోధించి అందర్నీ తమతమ పిల్లలతో కొంతమందిని యుద్ధానికి పంపమంది. ఒకరి చేతి క్రింద బానిసలయ్యేకంటే చచ్చిపోవడం మేలని బోధించింది. తన ఐదుగురిలో పెద్దవారి ముగ్గుర్నీ యుద్ధంలోకి పంపింది. తర్వాత మిగతా యిద్దర్నీ కూడా పంపేసింది.

రెండురోజులయిన తర్వాత ఒక రాజభటుడువచ్చి ఆమెతో "అమ్మా! మీ ఐదుగురుపిల్లలూ యుద్ధంలో చచ్చిపోయారు!" అని చెప్పాడు. "ఎవరిది విజయం" అని ప్రశ్నించిందామె. "తమలాంటి వీరమాతలుండగా మనకేమిటమ్మా! మనదే విజయం!" అన్నాడు వాడు.

"ఆమె ఏడవలేదూ?" అని ప్రశ్నించింది సుందరి. "ఆఁ...హాఁ! ఏడవలేదు! అంతేకాదు నా కొడుకులు చావలేదు. నా కొడుకులే కాదు ఎవ్వరూ చావలేదు! వాళ్లు అమరజీవులు. మనం ఓడిపోయి ఒకరిదగ్గర బానిసలయినప్పుడు కొడుకు లుండీ యేం లాభం? మన రాజుగారి చేతిలో మనం వున్నంతకాలం, ప్రజలు జీవిస్తున్నంతకాలం, నా కుమారులు బ్రతికేవున్నారు!" అంటూ ముగించింది ఉమాదేవి.

అప్పటికి చీకటిపడింది. ఆనాడు పౌర్ణమ. బాల సుందరి ఆ నక్షత్రాలవైపూ, ఆకాశంవైపూ చూడ సాగింది, నక్షత్రాలను లెక్కించబోయింది కాని సాధ్యంకాలేదు.

ఉమాదేవి కనిపెట్టింది సుందరి చేస్తున్న పనిని. "సుందరీ! ఏం చూస్తున్నావ్? అవి కావాలా రేమిటి?" అని అడిగింది.

"ఎలా వస్తాయి? అవి చాలాదూరంగా వున్నా యని చెప్పారుగా మా గురువుగారు!" అంది సుందరి.

"ఎబ్బే! ఎవరు చెప్పారు? ఆ గడ్డాలాయ నకేం తెల్సు! – నేను రోజూపోయేదక్కడికే! – చూడు ఆ చందమామ. అదే మా యిల్లు! కావలిస్తే నాతోరా. అన్ని నక్షత్రాలూ నీకిచ్చేస్తాను." అంది ఉమాదేవి.

"ఓ...! మరి ఎలా తీసుకువెళ్తావు?"

"నా భుజాలమీదకి యెక్కు! ఊఁ..." అంటూ ఉమాదేవి భుజంమీద ఎక్కించుకుంది బాలసుందరిని. అంతే! ఆకాశంలోకి ఎగిరిపోయింది!

ఇక ఉమాదేవి సంగతి చెప్పాలి. నిజంగా ఉమా దేవికాదు! దానికి పదహారేళ్లులేవు! దాని పేరు చీకటి పెద్దాశీ భూతం!

చీకటి పెద్దాజీభూతం ఒకనాడు భూలోకంలో సంచరిస్తూండగా దానికి ఒక రాజు కుమారుడు కన పడ్డాడు. ఆ రాజకుమారుడు చాలా అందంగా వున్నాడు. భూతంకి అతనిపై ప్రేమ కలిగింది. కాని రాక్షసిని ఆ రాజుకుమారుడెలా పెళ్లి చేసుకొంటాడు? సరే! భూతం తన మంత్రశక్తివల్ల ఒక చక్కని రాకుమార్తెగా మారింది.

రాజకుమారుడు మాయా రాకుమార్తెని చూసి ముగ్ధుడయ్యాడు. అంతేకాదు - ఆమెను ప్రేమించి పెళ్ళిచేసుకొన్నాడు.

కొన్నాళ్ళకి ఆ నరరాక్షస దంపతులకు ఒక చక్కని కుమార్తె కలిగింది. ఆ అమ్మాయి చాలా అందంగావుండేది.

దొంగతనం ఎన్నాళ్లు దాగుతుంది? రాజకుమారు డికి ఆమెభూతమని తెలిసిపోయింది! రాజకుమారు డికి భూతంపై కోపం, అసూయ, కలిగాయి. –దూరం ఆలోచించి, ఆత్మహత్య చేసుకుందుకు సిద్ధమయ్యాడు! అంతే! భూతం ఆహారంకై వెళ్ళివచ్చేసరికి, రాజ కుమారుడు, కూతురువుండేభవనం 'మసి' అయిపోయి వుంది! భూతం రాకుమారుడు మరణించినా, కూతురు వుంటే బాగుండేది అనుకుంది. కాని ఇద్దరూ బుగ్గి అయిపోయారు! మట్టిలో కలిసిపోయారు. ఆ అమ్మాయి కప్పటికి ఎనిమిదేళ్లుంటాయి! ఎంచక్కా వుండేది! – కాని ఏంలాభం? చచ్చిపోయిన అమ్మా యికిచారెడేసి కళ్ళన్నట్లు. అంతా అయిపోయిన తర్వాత ఏంచేస్తాం?

భూతం తనకూతురిపైవున్న ప్రేమను దూరంచేసుకో లేకపోయింది! – ఆనాటినుండీ ఎవరినో ఒకరిని, అంటే ఏదోవొకరాజ్యంలో ఎనిమిదేళ్ళ పిల్ల కనిపిస్తే ఆ అమ్మాయిని ఎలాగోలాగ మాయం, మంత్రంచేసి తీసుకువచ్చేది. తర్వాత (ముద్దుతీరేక) ఆ అమ్మా యిన్ని ఏ జంతువుగానో, పక్షిగానో మార్చేసేది!

అయితే బాలసుందరిమాత్రం అచ్చు దానికుమార్తెకి మల్లే వుండేదట! అందుకే తీసుకుపోతోంది.

పాపం! రాజూ, రాణీ పిల్ల చీకటిపడినా రాక పోవడానికి కారణమేమిటా అని వెళ్ళిచూశారు. ఇంకా అక్కడవుందా! అప్పుడే వెళ్ళిపోయింది.! దాసీలు అన్నారు "రోజూ ఉమాదేవి ఆడించే దమ్మా! ఈరోజూ వాళ్ళిద్దరూ కనపడలేదు" మంత్రి వెతుకుటకై సైనికుల్ని పంపాడు.

రాజూ, రాణీలు సుందరీ! అని కేకలువేసుకొంటూ ఉద్యానవనంలో తిరుగసాగారు!

బాలసుందరి ఉమ బుజాలమీద గట్టిగా కళ్లు మూసుకు కూర్చుంది. ఉమ ఆకాశంలోకి ఎగిరి పోయింది.

ఉమ తిన్నగాపోయి చంద్రలోకంలోకి వెళ్ళింది. "సుందరీ! ఇక భయంలేదు కళ్లుతెరువు!" అంది ఉమ. సుందరి కళ్లువిప్పి జూసేసరికి తానొక హంస తూలికా పాన్పుపై వుంది.

'నక్షత్రాలేవీ?' అని ప్రశ్నించింది.

'ఇదిగో!' అంటూ రత్నాలూ, ముత్యాలు కుప్పలు పోసింది.

"ఆఁహూఁ! అవి నాకొద్దు! అమ్మా నాన్నా కావాలి" అంటూ మారంజేసింది సుందరి.

"వెళ్దాముండమ్మా! చూడు! పాలూబువ్వతిను!" అంటూ బుజ్జగించింది. కాని ఏడుపు మరింత ఎక్కువయింది.

"అదిగో! బూచోడికిచ్చేస్తాను! తింటావా లేదా?" అని భయపెట్టింది. కాని లాభం శూన్యం.

అప్పుడు ఉమ "హైఁ! నేనెవర్నో తెలుసా?" అంటూ తన నిజరూపం చూపింది సుందరికి. దాంతో సుందరి ఏడుపు మానేసింది.

తర్వాత పాలూబువ్వా తీసుకువచ్చి సుందరికి తిని పించింది.

"ఉమా! నువ్వు రాక్షసివా?" అని అడిగింది అమాయకంగా సుందరి.

"ఎబ్బే! వూరికే నిన్ను భయపెట్టటానికలా అన్నాను." అంది భూతం.

'పడుకోవమ్మా; పడుకోవమ్మా,

మా బాలసుందరీ, మా చిట్టిసుందరీ

పడమట కోటల్లో ద్వారాలు మూయసాగారూ'

అని పడుకోబెట్టింది ఉమాదేవి సుందరిని.

సుందరి పడుకున్న తర్వాత ఆహారంకోసం తన భూతం రూపంలో వెళ్లిపోయింది.

మర్నాడు ఉదయం మామూలు ఉమారూపంలో వచ్చి,

'లేవమ్మా లేవమ్మ

మాబాలసుందరీ;

మా చిట్టిసుందరీ,

తూరుపూదర్వాజాలు

తెరువసాగారూ'

అంటూ లేపింది సుందరిని.

ప్రతీరోజూ సాయంకాలంపూట ఉమాదేవి సుందరికి అనేకరకములైన ఆటలు నేర్పేది. బాల సుందరి ఎన్నో ఆటలు నేర్చుకుంది.

ఒకనాడు బాలసుందరి 'చెరువులోవున్న హంసలు కావాలి!' అని కోరింది.

ఉమాదేవి 'సరే' నంటూ బంగారు కఱ్ఱతో సైగ చేసి రమ్మంది. అవి గబగబా వచ్చేశాయి.

"చిలుకలున్నాయా?" అని అడిగింది సుందరి.

"చిలుకలు కావాలా? ... చూడు" అంటూ హంసలను వెండికర్రతో తాకింది. అంతే! అవి చిలుకలుగా మారిపోయాయి! ఆ చిలుకల్ని తెల్లగా మార్చేది! రోజూ యిలానే ఆడుకొనేవారు.

కాలచక్రం తిరిగిపోతోంది. బాలసుందరికి పది ఏండ్లు వచ్చాయి. ఒకనాటి సాయంత్రం ఉమను

బాలసుందరి ప్రశ్నించింది "ఉమా! నీవు యిన్ని ఆటలు నేర్పావుగాని, పక్షుల్ని జంతువులు చెయ్యడం, జంతువుల్ని మనుష్యులు చెయ్యడం యెలాగో నేర్పావు కాదు! — అవి నేర్పవూ?" అని అడిగింది.

"అదెందుకమ్మా! నువ్వింకా పెద్దదానివయ్యాక నేర్పుతానులే!" అంటూ చెప్పింది ఉమ. కాని సుందరి పట్టినపట్టు విడవలేదు. అప్పుడు ఉమ అతి కష్టంమీద, "సుందరీ! నీవు యీ బంగారుకఱ్ఱతో మనుష్యులని తాకేవా, నీవు తలుచుకున్న విధంగా మారుతారు. వెండికఱ్ఱతో తాకితివా మామూలు రూపు వచ్చేస్తుంది." అంటూ చెప్పింది.

ఆ రాత్రి మామూలుగా ఉమ సుందరిని పడుకో బెట్టి, ఆహారంకోసం వెళ్ళిపోయింది.

సుందరి ఉమ వెళ్లనిచ్చి మెల్లగా లేచింది. తర్వాత తన పక్క క్రిందనున్న బంగారుబెత్తు, వెండిబెత్తు తీసుకు బయలుదేరింది. ఒకచోట ఒక పంజరంలో చిలుకవుంది. మరొకచోట బాతులు వున్నాయి. ఇలాగే అనేక రకములయిన జంతువులూ, పక్షులూ వున్నాయి.

సుందరి వాటినన్నిటిని పరీక్షిస్తూ వస్తూంది. ఒకచోట ఒకబోనులో ఒక సింహంవుంది. దాన్ని చూసి సుందరి కెవ్వున కేక వేసింది.

నిద్రపోతున్న ఆ సింహం 'ఎవరమ్మా నీవు? నేనూ నీలాటిదాన్నే! భయపడకు' అంది. బాలసుందరి యీ మాటలువిని దాన్ని వెండిబెత్తుతో తాకింది వెంటనే ఆ సింహం పదహారేళ్ల బాలికగా మారింది.

(సశేషము)

పిల్లా సుబ్బారావుశాస్త్రి

---

# తెలివిగల పిల్లిపిల్ల

ఒక నక్క దినమంతా తిరిగి తిరిగి ఆహారం దొరకక నకనకలాడే ఆకలితో ఎదురైన పిల్లిపిల్లను అమాంతం మ్రింగ బోయింది. ఆ పిల్లి పిల్ల భయపడ్తూ—

"నేనింత చిన్నజంతువును! — నన్ను తింటే నీ ఆకలేం తీర్తుంది! — మా యింటి యజమానురాలు వెన్న దాచియుంచే స్థలము చూపుతాను; దాంతో నీ ఆకలి తీర్చుకోవచ్చు" అన్నది.

"అయితే పోదాంపద" అని రెండూ బయలుదేరి వెళ్లాయి. ఒక బావి దగ్గరకు తీసికొనివెళ్లి బావిలోని నీళ్లలో కనుపిస్తున్న చంద్రబింబాన్ని చూపుతూ పిల్లి పిల్ల ఆ కనపడేదే వెన్నముద్ద" అన్నది.

"అయితే బావిలో నున్నది మనకెలా లభిస్తుంది" అన్నది నక్క.

"నేను ముందు బావిలోకిదిగి తిని వస్తాను" అని గిలకకు తగిలించియున్న ఒక బొక్కెనలో కూర్చొనేసరికి అది బావిలోనికిపోయి త్రాటికి రెండవ చివర నున్న ఖాళీ బొక్కెన పైకివచ్చింది.

బావి వెలుపలనున్న నక్క భావిలో నున్న పిల్లిపిల్లతో "అంతా నీవేతిని రావాక - వచ్చేటప్పుడు నాకు కొంచము తీసికొనిరా" అన్నది.

"నేనెలా తీసికొనిరావడం! - యింకా

చాల యున్నది. నీవ్రువస్తే కావలసినంత తిందుగాని – వ్రేలాడుతున్న రెండవబొక్కెనలో కూర్చో; నీవుకూడ రావచ్చు'' అన్నది పిల్లిపిల్ల.

నక్క నిజమేననుకొని బొక్కెనలో ఎక్కి ఎక్కకమునుపే జర్రున బావిలోకి పోయింది ; పిల్లిపిల్లయున్న బొక్కెన పైకి వచ్చేసరికి ఎగిరి గంతేసింది బయటికి.

పిల్లిపిల్ల యుక్తితో ప్రాణం దక్కించుకుంది. నక్క పాపం బావిలోపడి చచ్చిపోయింది.

రామరాజు సీతాకళ్యాణి

---

# నారదుని గర్వభంగం

త్రిలోక సంచారి నారద మహర్షికి తన్ను మించిన హరి భక్తుడులేడని, తానే గొప్ప దైవభక్తుడననే అహంభావం ఉండేది. ఈ సంగతి శ్రీమన్నారాయణుడికి తెలుసు. నారదుని గర్వమెలాగైనా అణచాలని సమయానికి వేచియున్నాడు.

ఇట్లుండగా ఒకనాడు నారదుడు భూలోక సంచారం చేస్తుండగా ఒక చిత్రం జరిగింది. అది మృగశిరకార్తి; అప్పుడే సూర్యోదయంకావడం చేత యెవరి పనులలోవారు చాలా హడావుడిగా ఉన్నారు. ఒక కర్షకుడు యెద్దులచే పొలం దున్నుతున్నాడు. అతడి నోటియందు పలుదోము పుల్ల ఉంది. ఎద్దుల వెనక నడుస్తూ, సంజ్ఞలతోను, అరపులతోను వాటిని బెదిరిస్తూ తోలుతూ హరినామ కీర్తనలు పాడుతున్నాడు. మధ్య మధ్య నోటిలోని వేపపుల్లతీసి, తుపుకున ఉమ్మివేసి, తిరిగి హరినామ స్మరణ చేస్తున్నాడు.

ఈ దృశ్యాన్ని నారదుడు తదేక దృష్టితో చూస్తున్నాడు. పవిత్రమైన విష్ణునామాన్ని పాచి నోటితో ఉచ్చరిస్తూ, అపవిత్రం చేస్తున్న ఆ రైతుపై నారదునకపరిమితమైన ద్వేషం, అసహ్యం కలిగాయి. నారదుడలాగే నిలబడి చూస్తున్నాడు. ఎంతసేపటికీ రైతు దంత ధావన పూర్తయ్యే సూచనలు కనబడుటలేదు. నారదుడు విసిగి దేవలోకానికి వెళ్ళిపోయాడు.

జరిగిందంతా విష్ణుమూర్తికిచెప్పి, "ఇటువంటి మూర్ఖుల్ని నీవెలా భరిస్తున్నావు స్వామీ ?" అని ప్రశ్నించాడు. అందుకు విష్ణుమూర్తి "అతడెంత గొప్ప దైవభక్తుడో నీకేం తెలుసు ?" అన్నాడు. నారదుడికి అరికాలిమంట నెత్తికెక్కింది. "నాకంటేనా ?" అని ఉద్రేకంతో అడిగాడు. విష్ణుమూర్తి చిరునవ్వునవ్వి, ఒక రజితపాత్ర నిండుగా నూనెపోసి నారదుడికిచ్చి, "ఈ గిన్నెతీసికొని మూడు లోకాలూ సంచారం చేసిరా. గిన్నెనుండి ఒక్క నూనెచుక్కకూడా క్రిందపడగూడదు సుమా !" అని హెచ్చరించాడు.

సరేనని నూనెగిన్నె తీసికొని నారదుడు త్రిలోక సంచారానికి బయలుదేరాడు. త్రోవలో యెన్నో వింతలూ, విశేషాలూ జరుగుతున్నా వాటిమీదకు దృష్టి పోవడంలేదు మననారదుడికి. ధ్యాసంతా నూనెగిన్నెమీదే ! ఒక్క చుక్కకూడా వలకకూడదని విష్ణుమూర్తి చెప్పాడు. మాట దక్కించుకోవాలి. విజయం పొందాలి. ఇవే ఆలోచనలతో అడుగులో అడుగువేస్తూ నారదుడు మూడు లోకాలూ

చుట్టాడు. నూనె ఒక్క చుక్కగూడా క్రిందకు తొణకలేదు. గిన్నె విష్ణుమూర్తి కిచ్చాడు.

"నూనెచుక్క క్రిందపడలేదా నారదా?" అని విష్ణుమూర్తి ప్రశ్నించాడు. "లేదు స్వామీ!" అని నారదుఁడు జవాబిచ్చాడు. "సరేకాని నీవు మూఁడు లోకాలూ తిరిగి వచ్చావు. ఈ సమయంలో నానామ మెన్ని పర్యాయములు జపించావో చెప్పు" అని విష్ణువడిగాడు. ఈ ప్రశ్నకు నారదుఁడు తెల్లఁబోయాడు. నిజానికి తన ధ్యానమంతా నూనెగిన్నె మీఁదతప్ప మరిదేనిమీఁదకూపోలేదు. ఆ సమయంలో హరినామం ఒక్కసారికూడా జపించియుండలేదు. ఇపుడేం చెబుతాడు. తన బుద్ధి పొరపాటుకు తన్నుతానే లోలోపల నిందించుకున్నాడు.

"ఒక్కసారిగూడా నన్ను తలంచియుండలేదుకదూ నారదా!" విష్ణువు తిరిగి అడిగాడు. నారదుఁడికేం చెప్పడానికి తోచలేదు. నిజం ఒప్పుకున్నాడు.

"చూడు నారదా, నూనెగిన్నె మీఁద మనస్సుంచి నీవు నన్ను పూర్తిగా మరచిపోయావు. సంసార లంపటుఁడైన ఆ పేదరైతుకు నిత్యం బాధ లనేకం ఉంటాయి. అయినా యేపరిస్థితుల్లోను నన్ను మరువడు. సర్వకాల సర్వావస్థల్లోను అతఁడు హరినామ స్మరణ చేస్తుంటాడు. భక్తికి ప్రధానం 'మనస్సు'. అతడే నిజమైన భక్తుఁడు. నీవు ఓడిపోయావు నారదా!" అని విష్ణుమూర్తి చెప్పేటప్పటికి నారదుఁడు సిగ్గుపడి తలవంచుకున్నాడు. అంతటితో నారదుఁడికి గర్వం కాస్తా వదిలింది.

గంధం సత్యవతి

---

# చదువుకోవాలి!

బాల్యమునందే బాలిక లెల్లరు
పంతముతోడను చదవాలి!
వింత విద్యలను నేర్చాలి!
నాతులు నీతులు నేర్చుకొనుటకై
బడిలో పాఠాల్ చదవాలి!
భాషా జ్ఞానము పొందాలి! ॥ బా ॥
విద్యా హీనుల జీవితమంతా
వ్యర్థంబని మది తెలియాలి!
వింతపశువులయి తిరుగాలి! ॥ బా ॥

నగలు ధరించిన నాతి అందము
అందముగాదని తెలియాలి!
విద్యావతియగు వనిత లెల్లరు
సహజ సుందరని యెరుగాలి ॥ బా ॥

విద్యా భాగ్యము వెలదులదైతే!
గృహిణి నిజంబుగ గృహలక్ష్మైతే!
పురుషులు పొమ్మని జెప్పుట కల్ల!
సమాన హక్కును జెందుదు రెల్ల! ॥ బా ॥

మరువాడ వెంకటరమణమ్మ

---

ఓ గ్రామానికి వచ్చిన ఒక నూతనవ్యక్తి ఒక పెద్ద మనిషితో "ఇక్కడ న్యాయంగా ఏదో విధంగా జీవయాత్ర సాగిద్దామని వచ్చాను."

"మంచిది - నీతో పోటీచేయడానికి అంతగా ఎవరూ లేరులే"

(634 పేజి తరువాయి)

ఈ గేయా లక్షణం మాత్రాఛందస్సు. ఆరేసి మాత్రల గణాలు మూడు తర్వాత తక్కువ మాత్రల గణమొకటుంటుంది. పాటకాబట్టి మాత్రల ఎక్కువ తక్కువలు పట్టివ్వవు. యతి స్థానం మూడోగణం మొదటి అక్షరం. స్వేచ్ఛామైత్రి.

దీనికి జనతఉండే ఉత్తర ఆర్కాడు జిల్లాతో భాష దీనిలో కనబడుతూంది — బేడలు (పప్పు) - (పుట 29), ఏమార్చు (మోసముచేయు 31), కోతి (తిట్టు 32); అమ్మాడి (అమ్మయ్య 33); తూకి (ఎత్తుట); మడతి (పడతి)

'మడతియు బిడ్డలున్ను మరణమైనది బావియందు' (35) పక్కాకుపెట్టుట (పేరంటమునకు పిల్చుట35); దొర (రాజు 40)

ప్రసిద్ధి

శీలవతి, భర్తరాలు ఐన నాయకను కవి సృష్టించేడు. అంతేకాదు, దీనిలో ఉండే ఒక విశేషమేమంటే తర్వాతి పాటలలో కొన్ని పాత్రలకు మార్పులను అందించేడు. నల్లతంగాళ్ మీద నల్లతంబికి ఎక్కువ వాత్సల్యం. దీనికి తర్వాత ఎప్పుడో రచించబడ్డ సన్యాసమ్మ కథలో ఇట్టి పాత్రలే ఉన్నాయి.

స్త్రీలు పవిత్రలు, ధర్మపరులు, పతివ్రతలుగా ఉండాలనే భావాన్ని ఈ గేయకవి ఢంకామీద దెబ్బకొట్టి చెప్పేరు. నల్లతంగాళ్ తన పిల్లలకోసం ఆత్మగౌరవం కోసం తనజీవితాన్ని బలిదానం చేసింది. ఆమె పేరంటాలయింది. ఆటుతర్వాత అనేకమంది పేరంటాళ్ళ కథలు బయలుదేరాయి.

ఈ గేయానికి పరిశుద్ధ ప్రతి అవసరం.

విఖ్యాత బాధానివారిణి
నోపెయిన్ యొక్క
అసమాన శక్తిచే దానిఖ్యాతి
విస్తరించుచున్నది
పెద్ద, చిన్న
ట్యూబులలో దొరకును
కలకత్తా
కెమికల్
కలకత్తా 29
నోపెయిన్
బాధలన్నీ మాన్పును
TEL-1A
"సౌత్ ఇండియా ఆఫీసు : 5/149, బ్రాడ్వే, మద్రాసు 1."

# విండర్ మియర్ సతి విసనకర్ర


రచయిత : ఆస్కార్ వైల్డ్

అనువాదం : పో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.


(సెప్టెంబరు సంచిక తరువాయి)

సిసీల్ గ్రహం: ఆవిడతో రకరకాలైన విషయాల్ని గురించి మాట్లాడవచ్చులే, టప్పీ (లేచి అతనివైపు వెడుతూ)

అగస్టస్ ప్రభువు –ఏమోయి, నువ్వు నాకు చాలా చీకాకు కలిగిస్తున్నావు; నిజంగా చాలా చికాకు కలిగిస్తున్నావు.

సి.గ్ర:–(అతని భుజాలమీద చేతులువేసి) ఇదిగో టప్పీ, నీరూపం పాడయ్యింది, నీ గుణం పాడయ్యింది – ఆఖరికి నీ సౌమ్య గుణాన్నికూడా పాడుచేసుకోకు; సుగుణం ఒకటే ఇప్పటి నీ సొత్తు.

అ.ప్ర:–నేనే ఈ లండనులో మంచి సుగుణవంతుణ్నై యుండకపోతే-

సి.గ్ర:–మేము నిన్ను ఎక్కువగా గౌరవించేవాళ్లం. అంతేనా టప్పీ (పచారు చేస్తాడు)

డంబీ:–ఈ కాలపు యువకులు బొత్తిగా పాడైపోయారు. వాళ్లు రంగుపూసుకున్న తలకాయిలకన్నా కాస్త మర్యాద ఇవ్వాలా?

అ.ప్ర:–(కోపంతో నలువైపులాచూస్తాడు.)

సి.గ్ర:–మిసెస్ ఎర్లిన్‌కి టప్పీపట్ల చాలా గౌరవం.

డంబీ:–తన్మూలంగా ఆమె స్త్రీ జాతికే చక్కని గుణపాఠం చెబుతుందన్న మాట. భర్తలను తప్పిస్తే మిగతా పురుషులతో ఎలాగ ప్రవర్తించాలో ఈ కాలపు స్త్రీలకి ఎంతమాత్రమూ తెలీడంలేదు.

విండర్ మియర్ ప్రభువు:–డంబీ! నీ ప్రవర్తనేమీ బాగాలేదు. సిసీల్ నీవు అతివాగుడు వాగుతున్నావు. ఇక మిసెస్ ఎర్లిన్ ఊసు ఎత్తకండి. మీకు ఆవిడ సంగతి ఏమీ తెలియకపోయినా ఆవిణ్ణి గురించి దుష్ప్రచారం చేస్తున్నారు.

సి.గ్ర:–(అతనివైపువస్తూ) ఆర్థర్, నేనెప్పుడూ దుష్ప్రచారం చెయ్యను. ఏదో పుక్కిటి పురాణం మాట్లాడతా.

విం.ప్ర:–దుష్ప్రచారమూ, పుక్కిటి పురాణమూ రెండూ ఒకటేగా!

సి.గ్ర:–పుక్కిటి పురాణం బలే సరదాగా ఉంటుందిలే – చూడు – చరిత్రంతా పుక్కిటి పురాణమే. పుక్కిటి పురాణాన్ని నీతితో మిళాయించి నిస్సారంగా

చేస్తే అది దుష్ట ప్రచారం ఔతుంది. నేనెప్పుడూ నీతిని గురించి ఉపన్యసించను. కపటియైన పురుషుడే నీతిని గురించి మాట్లాడతాడు; అందవికారమైన స్త్రీ నీతిని గురించి మాట్లాడుతుంది. మడిగట్టుకున్న మనస్సుకలిగి ఉండడం స్త్రీకి ఎంత మాత్రమూ తగదు. అందరు స్త్రీలకీ ఆ విషయం తెలుసు అనేది మనకు చాలా సంతోషదాయకము.

అ.ప్ర:-మా బలే ఉత్సాహంగా మాట్లాడేస్తున్నావే.

సి.గ్ర:-వినడానికి విచారంగా ఉంది టప్పీ; ఏ విషయంలోనైనా ఇతరులు ఏకీభవిస్తే నేను పొరపాటుచేసేను అనుకుంటూ ఉంటాను.

అ.ప్ర:-అబ్బాయీ! నేను నీ వయస్సులో ఉన్నప్పుడు-

సి.గ్ర:-నువ్వెప్పుడూ ఆ వయస్సులో లేవు, ఉండబోవ్వూకూడా ('సి' టేబిల్ దగ్గిరకి వెడతాడు) ఏమోయి, డార్లింగ్టన్ కాస్సేపు పేకాట ఆడదామోయి. ఆర్థర్ నీవు ఆడతావుకదూ?

వి.ప్ర:-వద్దోయి, ధన్యవాదాలు సిసీల్.

డంబీ:-(నిట్టూర్పుతో) భగవంతుడా! పెళ్లిమనుష్యుని ఎంతపాడుచేస్తున్నది! సిగరెట్టులాగ మనిషి సత్తువని పీల్చేస్తుంది! పైపెచ్చు అంతకంటే ఖరీదెక్కువకూడా.

సి.గ్ర:-నీవు తప్పకుండా ఆడతావుకదూటప్పీ?

అ.ప్ర:-(బ్రాందీ సోడా గ్లాసులోపోస్తూ) వద్దోయి నాయనా, ఇకమీదట ఆట ఆడను, తాగను అని మిసిస్ ఎర్లిన్‌కి వాగ్దానం చేసెను.

సి.గ్ర:-టప్పీ సహోదరా! దారితప్పి సన్మార్గములోపడబోకు. సుగుణవంతుడివయ్యేవంటే నీతో మాట్లాడడం బహుచిరాకు. అది ఆడవాళ్లలోఉన్న దురలవాటు. ప్రతీ వ్యక్తీ మంచిగా ఉండాలనివాళ్లు కోరతారు. వాళ్లు మనల్ని కలిసేటప్పుడే మనం సుగుణవంతులమైయుంటే, వాళ్లు మనని ప్రేమించనే ప్రేమించరు. వాళ్ళు మనల్ని కలిసేముందు మనం చెప్పలేనంత చెడ్డవాళ్లంగా ఉండాలి, వాళ్ళు మనల్ని విడిచిపెట్టేప్పుడు ఎందుకూ పనికిరాని మంచివాళ్లగా ఉండాలి, ఇదీ వాళ్ళు కోరేది.

డార్లింగ్టన్ ప్రభువు:-(ఉత్తరాలు వ్రాయడం ముగించి 'ఆర్' టేబిల్ దగ్గిరలేచి) మనం ఎప్పుడూ దుష్టులం అనేదే వాళ్ల మతం!

డంబీ:-మనం దుష్టులమని నేను ఎంత మాత్రమూ ఒప్పుకోను. టప్పీని తప్పిస్తే, మనమంతా మంచివాళ్లమే.

డా.ప్ర:-లేదోయి, మనమంతా ఊబిలోనే ఉన్నాం. అయితే కొందరం నక్షత్రాలవైపు చూస్తున్నాం. ('సి' టేబిల్ దగ్గిర కూర్చుంటాడు.)

(సశేషము)

# తాతయ్య ప్రహసనం

శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మ

(గతసంచిక తరువాయి)

[బుద్ధిలేని మహారాజుయొక్క ఆస్థానములో పండితుల సత్కార సందర్భమున సనాతనులు, వైదికశ్రేష్ఠులు, గాయకులు సన్మానించబడిన తరువాత పేరూ, వూరులేని, చీము నెత్తురులేని శంకయ్య అధ్యక్షతన కవి సన్మానం ప్రారంభమయింది. భావకవులు తమ నుచితంగా సన్మానించలేదనే కినుకతో పారిపోతుండగా భటులు పట్టుకొని ఎక్కడికో తీసికొని వెళ్తారు. ఆస్థాన విద్వత్కవి సభాసదుల నుద్దేశించి భావకవుల పోకడలను వివరిస్తాడు - యిక చదువండి.]

మిగిలిన అందఱిలో ఒక కవి:—

నిజమేనండి, కానీ భావకవులలో గొప్పవారూ ఉన్నారండి. వేషాలు లేకుండా, నియమాలు తప్పకుండా క్రమపద్ధతితో ఇంగ్లీషులోంచి దిగుమతిచేసే మహామహులున్నారండి. శబ్దజ్ఞానం, అర్థజ్ఞానం వుండడమేకాక శాస్త్రజన్య జ్ఞానంకలవాళ్ళు ఉన్నారండి.

ఆ. వి. క:—నే నెఱుగుదు — ఆ వున్నాయన ఒక్కడే. ఆయనకూడా ఈ మధ్య సన్యసించి వూరుకొన్నాడు.

మి. అం. క:—ఇంగ్లీషు శాస్త్రాలలో పాండిత్యం వున్న అత్యధిక సంఖ్యాకుల్ని తాము ఎఱుగరు.

ఆ. వి. క:—చాల్లేవయ్యా! తెలుగులో కవా? ఆంగ్లంలో కవా?

మి. అం. క:—ఏ భాషలోనైతేనేం?

ఆ. వి. క:—ఇంగ్లీషులో అప్రయోజకుడై యేదో ఒక పేరు ఆంధ్రంలో సంపాదిద్దామని వచ్చిన వాళ్ళేగా యీ బుద్ధావతారాలు?

మి. అం. క:—ఆంధ్రం అంటే అంత తేలికనాఅండి?

ఆ. వి. క:—తెలుగులో సరకు సంస్కృతంలోది, ఇంగ్లీషులోది, హిందీలోదితప్ప యింక తెలుగున కేదేని సొంత సరకున్నదా? నిజంచెప్పు. దుమువులు తప్పితే తెలుక్కి ఏమి సరుకున్నదీ! తెలుగులోని సరకులు, వెలయాలి శరీరం; మీది సరకులల్లా అరువు సరుకులేగా?

మం:—ఇంక మీ వివాదము చాలించండి. సన్మానాలు కానివ్వండి. మీకు కావల్సింది కోరుకోండి.

మి. అం. క:—మా పుస్తకాలు అచ్చువేయిస్తే అదే సన్మానం.

మం:—ఇక్కడ పారేసిపొండి.

మి. అం. క:—మీరు అచ్చు వేయించడం ఆలస్యం అయితే చెదలుపట్టేస్తాయ్ గ్రంథాలు.

మం:—అట్లా చెదలుపట్టేస్తే విమర్శకులు, పాఠభేదాల పండితులు, పీఠికా జ్ఞానపండితులు సర్దుకుపోతారులెండి.

మి. అం. క:—అయితే మా పుస్తకాలు మేంబ్రతికి ఉండగా అచ్చుకావాండీ?

మం:—అదృష్టం ఉన్నవాళ్ళవి ముందు అచ్చవుతాయి.

మి. అం. క:—ఎవరదృష్టవంతులు? ఎవరు దురదృష్టవంతులండి?

మం:—ఆ సంగతి కాలదేవత చూచుకొంటోంది.

మి. అం. క:—పుస్తకాలు అచ్చుకావడం ఆలస్యమైతే కీర్తిరాదే?

మం:—దురదృష్టవంతులకే కీర్తి వచ్చితీరుతుంది.

మి. అం. క:—అదెట్లా?

మం:-దురదృష్టవంతుల పుస్తకాలేగదా చెదలుపట్టుట అవుతుంది. ఆ చెదలుపట్టిన పుస్తకాలు దొరక్కపోతే, పనీపాటలేని, ప్రతిష్ట అప్రతిష్టలేని, వ్యుత్పత్తి ప్రతిభాలేని, వూరూ పేరూలేని అప్రయోజకులకు కీర్తిని భుక్తిని ఇచ్చేవి, మరేముంటాయ్ గనుక ?

మి. అం. క:-పై విశేషాలవారు ఏ తెగకుచెందిన పండితులండి ?

మం:-విమర్శకులు విమర్శ వ్రాస్తారు. పీఠికాజ్ఞాన పండితులు పీఠికలు వ్రాస్తారు — పాఠభేదాల పండితులు పాఠభేదాలు వ్రాస్తారు. పై విశేషణాల వారు మూడు తెగలుగా వుంటారు. లేదా ఆ మూడు లక్షణాలు నాకేవున్నాయి అనే అహంభావ సంపన్నజాతికి చెంది వుంటారు.

మి. అం. క:-పై వారిలో సత్తువలేదని మీరు ఎట్లా చెప్పగలరు ?

మం:-పైవారికి వ్యుత్పత్తి, ప్రతిభవున్నచో స్వతంత్ర — కావ్యాలను వ్రాస్తూండటంతోటే జీవితం వెళ్ళిబుచ్చుతారు. అట్లాంటి కావ్యనిర్మాణ చాతుర్యం పై లక్షణాల వాళ్ళకి లేకపోవడం వల్లనే "యేనకేనా ప్యుపాయేన ప్రసిద్ధాః పురుషోభవేత్" అనేసూత్రాన్ని ఆశ్రయించడం జరుగుతుంది — ఇదంతా కాదంటే చెప్పండి? ఎవఁడైన కావ్యనిర్మాణమునకుఁ జాలిన ప్రతిభావ్యుత్పత్తులుండినవాఁడై కావ్యనిర్మాణమునకు కాలము గడుపక కోడిగుడ్డుకి తంటసంపనికి సిద్ధమవుతాడని నీవు చెప్పగలవాయని యెవరంతరాత్మతో వారు ప్రశ్నించుకొని చూడండి.

మి. అం. క:-విమర్శ అంటే కళ అంటారుగదాండి.

మం:-విమర్శఆనే పదము పదార్థము మాత్రము శుద్ధమైనవే కాని ఆ పేరుతో పేరూవూరులేని ద్రాభలు — చేసే పనులుమాత్రం అసహ్యంగా ఉన్నాయి.

మి. అం. క:-ఆ అసహ్యం యెట్టిది ?

మం:-కవిపేరునుబట్టి, ఊరిని బట్టి, ఆ కవి గురువుల్నిబట్టి, కులాన్నిబట్టి, లింగాల్నిబట్టి, స్తనశల్య పరీక్షలతో చేసే విమర్శనలు విమర్శన పదార్థాన్ని కళంతం చేస్తున్నాయి—ఇంక ఈ వ్యవహారాలు కట్టిపెట్టండి — ఖండ కావ్యాలతో మీరంతా మహా కవులవుతారయ్యా మరీ ?

మి. అం. క:-వ్రాసిన భారతమేవ్రాసి, వ్రాసిన భాగవతమేవ్రాసి, వ్రాసిన రామాయణమే వ్రాస్తూండాలని తమరి సెలవా?

మం:-ఆముక్తమాల్యదవంటి గ్రంథాలు వ్రాయరాదూ?

మి. అం. క:-అట్టివి వ్రాస్తే చదివేవాళ్లు ఉండవొద్దూ? ఓవేళ అర్థంచేసుకొందాం అనే ఆస్థవున్నవాళ్లుంటే అర్థం చెప్పగల్గే తెలుగు పండితులేరీ యీనాడు.

మం:-మీరే ఓ వ్యాఖ్యానం వ్రాసేయండి.

మి. అం. క:-వ్యాఖ్యానాలు మాత్రం జీర్ణించుకొనే వారేరండి.?

మం-—మీలో ఎవరన్నా అట్టి ప్రౌఢకావ్యం వ్రాయగల్గేవారున్నారా ?

మి. అం. క:-లేకేమండీ ! ఉన్నారు. కాని తగిన సత్కారంచేసే ప్రభువులు లేరండి.

మం:-మా మహారాజులున్నారుగా. మీలో ఆ పెద్దమనిషి యెవరో ముందుకిరండి. వారి వ్యుత్పత్తి, ప్రతిభ ఏమేమిజాతికి చెందినవో వివరించండి.

మి. అం. క:-ఆంగ్లంలో షేక్స్పియర్, గోల్డుస్మిత్, వర్డ్స్వర్త్ వగైరా కవుల గ్రంథాల్ని నూరుకు తాగిన మహామహులు వున్నారు అధికంగాను — ఇంకా హిందీవాఙ్మయం, తమిళ వాఙ్మయం, నమిలి వుమ్మేసినవాళ్ళుకూడా ఉన్నారండి.

మం:-ఏడిసినట్టే ఉంది. ఉపనిషత్తులు, వేదాలు, వేదాంతాలు, పురాణాలు చదివి జీర్ణించుకొన్న ముక్కాకల కాగే మొనగాళ్ళు ఎవళ్ళూ లేరన్న మాట. అయితే మీరంతా పనికిరారు పొండి. ఖద్దరు శాలువాలు ఒక్కొక్కటి తీసుకొనిపొండి. నోరు మెదపకుండా పొండి. పైవి చదువుకోకుండా మా సభకు రాకండి.

మి. అం. క:-(నిష్క్రమిస్తారు — గొణుక్కొంటూ)

మ:-ఈవేళ సభ ముగిసింది — కాలకృత్యములు తీర్చుకొండి. [అందరు నిష్క్రమిస్తారు)

(సశేషము)




**జీవితం (సాంఘిక నాటకము) : మన్నూరు సత్యనారాయణగారు, ఆంధ్ర నాటక సాహిత్య సంఘం, జంషెడ్పురం. వెల రు 1-8-0.**

ఇందులోని కథావస్తువు మానవజీవితంలోని వివిధ రకాలైన మానవప్రవృత్తులు, వాని ననుసరించిన అన్యాయాలు, అక్రమాలు; చివరకు ధర్మమే జయమని చిత్రిస్తూ న్యాయాన్ని, ధర్మాన్ని ప్రోత్స హించడానికి పూనుకొన్నాడు గ్రంధకర్త.

నాటకం చదువుతున్నంతసేపు ఉత్సాహవంతముగా నున్నది. భాషాసంపద అంతగా పేర్కొనతగినది కాకపోయినా యిది ప్రథమ ప్రయత్నంకాబట్టి ముందుముందు మరింత నైపుణ్యంతో గ్రంధకర్త నాటక రచనలు సాగిస్తారని ఆశిద్దాము.

**శ్రీ కన్యకాపరమేశ్వరీ శతకము : 'కవి చంద్రులు' కోటసోదరకవులు. ప్రాప్తి స్థానము ; కవిచంద్ర గ్రంధమాల, కనిగిరి, నెల్లూరుజిల్లా. వెల 0-6-0.**

గ్రంధకర్తలు పండితులు, అష్టావధానులు. వీరి ఆశుకవిత్వము ఆంధ్రదేశమునకు సుపరిచితము. వీరు అనేక ఉద్గ్రంధములను రచించినవారు. వీరు పరాశక్త్యవతారాఖ్యతో జెన్నూరు శ్రీకన్యకా పరమేశ్వరిని స్మరించుటకు, స్తోత్రము చేయుటకు, కీర్తించుటకు నుద్దేశించి రచించారు.

మృదుమధురశైలితో, గంభీరమైన భావాలతో యిందలి పద్యములు అనన్య భక్తకోటికి హృద్యమైనవిగా నున్నవి. ఇందలి కవితానైపుణ్యము గ్రంధకర్తల ఆధునిక కవితా పటిమను ప్రస్ఫుటింప జేయుచున్నది.

**తప్పెవ్వరిది (దృశ్యనాటిక) : గోపరాజు రామారావుగారు. ప్రచురణ కర్తలు : గోపీ పబ్లికేషన్స్, సత్యనారాయణపురం, విజయవాడ-2. వెల 0-8-0.**

ఇదికూడ సాంఘిక నాటకమే. సంఘ ఆచారాలనే పేరుతో సామాన్యప్రజానీకం ఎట్టి అత్యాచారాలకు, అన్యాయాలకు బలియగుచున్నది గ్రంధకర్త చిత్రించారు. సంఘంలో నీతి నియమాలను, ఆదర్శనీయమయిన జీవితాన్ని రూపొందించుకోనడానికి, మానవుడు ఎదుర్కొంటున్న కష్టాలను, మహోపద్రవాలను దృష్టిలో నుంచుకొని అవకాశమున్నంతలో సుఖంగా జీవయాత్ర చేయడాన్ని ప్రబోధిస్తూ, సంఘసేవకు ఉద్యుక్తులను చేస్తున్నదీ నాటకము.

రచనాధోరణి, భాషాశైలి చక్కగానున్నవి. మానసిక పరివర్తనకు సంఘంలో నిట్టి నాటక ప్రదర్శనము లత్యంతావశ్యకములు.

—o—

# సంపాదకీయములు

## హిందూ వివాహాల విడాకుల బిల్లు చర్చ :

జాతీయ విశిష్టతకు భంగమురాకుండా ప్రస్తుతము సంఘములోని లోటుపాట్లను సంస్కరించడానికి ఉద్దేశించినవే వివాహాల విడాకులబిల్లు, సెలెక్టుకమిటీ సూచనలున్నూ. ఈ సందర్భమున రాజ్యసభలో జరుగుతున్న చర్చలు ప్రతియొక్కరు గుర్తించతగినవి. సెలెక్టుకమిటీ సూచనలలో పరిణయ వివాహమాడతగువయః పరిమితి నిర్ణయసందర్భమున స్త్రీ పురుషుల వయస్సు క్రమంగా 15 నుండి 16 సం॥ లకు 18 నుండి 21 సం॥ లకు హెచ్చించాలన్నది ఒకటి. ఈ హెచ్చింపుకు కాంగ్రెస్ సభ్యులలో అధిక సంఖ్యాకులు విముఖంగానున్నారు. అట్లే భర్త భార్యకు మనోవర్తి యివ్వవలసినట్లే ఆస్థిపాస్తులు, ఆదాయముకల భార్య నిరాధారుడైన భర్తకు వివాహము రద్దయిన సందర్భమున మనోవర్తి యివ్వవలసి యుంటుందన్న సూచనకుకూడ కొందరు వ్యతిరేకతను వెల్లడిస్తున్నారు. కాని స్త్రీలు పురుషులు సమాన సామాజిక ప్రతిపత్తి కోరే సందర్భమున ఉభయులకు అన్యాయం జరుగకుండా హక్కులకు, అవకాశాలకు రక్షణ అత్యావసరము. దానికి భర్తకు భార్య మనోవర్తి యివ్వవలసి యుంటుందనేది దోహదం కాగలదు.

రాజ్యసభలో ఒక సభ్యుడు విడాకులను వ్యతిరేకిస్తూ దంపతుల్లో శాంతియుత సహజీవనము నుద్దేశించి విడాకు లనవసరమన్నాడు. డాక్టర్. సీతాపరమానంద్ గారు స్త్రీలకు పురుషులతోబాటు సమానమైన సమాజిక ప్రతిపత్తిలేని కారణమున విడాకులు కోరేహక్కు వివాహం జరిగిన 10 సం॥ల వరకు స్త్రీలకు మాత్రమే యుండాలన్నారు.

దంపతుల్లో శాంతియుత సహజీవనము ముమ్మాటికి వాంఛనీయమే. కాని స్త్రీ పురుషులుభయులలో ఏ ఒక్కరైనా బాధ్యతారహితంగాను, నీతి నియమాలు తప్పిగాని వ్యవహరించిన ఫలితంగా వారు వ్యక్తిగతంగా తమ హక్కులను, అవకాశములకు రక్షించుకోడానికి, జీవితసౌలభ్యాన్ని సమకూర్చుకోడానికి విడాకులుకంటె మరొకమార్గం లేనప్పుడు విడాకులు అత్యవసరమే కాగలదు. దానిని వ్యతిరేకించడం అభివృద్ధినిరోధకమే కాగలదు. సమానమైన సామాజిక ప్రతిపత్తి స్త్రీలకు లేదనడంగాని, వివాహమయిన 10 సంవత్సరముల లోపల విడాకులు కోరేహక్కు స్త్రీలకు మాత్రముండాలనడంకాని సమానమైన సమాజిక ప్రతిపత్తి నుద్దేశించి కాకపోవడమేకాక సంఘంలో పురుషులకు అన్యాయం తలపెట్టడమే కాగలదు. విడాకులు కోరేహక్కు స్త్రీ పురుషుల కుభయులకు సమానంగా నుండాలి.

ఇటువంటి బిల్లులు శాసనాలుకాబోయేముందు ప్రజా ప్రతినిధులు వాస్తవిక పరిజ్ఞానానికి దూరం కాకుండా, ఉమ్మడి సంఘం మరింత సన్నిహితంగా పటిష్టమై నైతికస్థాయి పెరిగి సౌభాగ్యవంతంగా వర్ధిల్లుటకనువుగా చర్చించి ఉచిత నిర్ణయాలు చేయాలి.

---

'ఆంధ్ర మహిళ' వార్షిక సంచిక ఆకర్షణీయంగా 184 పేజీలతో వెలువడింది. ఇందులోని సారస్వత, సాంస్కృతిక, విద్యావిజ్ఞాన సంపన్నములైన అమూల్యమైన వ్యాసాలు, కథలు, నాటికలు, సౌందర్యపోషణ, పాకకళ, బాలానందం, గృహపరిశ్రమలులాంటి ప్రత్యేక శీర్షికములు సంచికను సర్వాంగ సుందరముగా రూపొందించినవి. ఈ సంచిక 'ఆంధ్రమహిళ' నిర్వాహకులకృషి, దీక్షలనేకాక ఆంధ్ర మహిళాసభ పురోభివృద్ధికికూడ చిహ్నముగానున్నది. సంచికవెల రు 1-0-0. వలయువారు ఆంధ్రమహిళా సభ, మైలాపూరు, మద్రాసు-4 కు వ్రాసి తెప్పించుకోవచ్చును.

—o—

13244

# శ్రీ జయనామ సం॥ర మార్గశీర్ష - పౌష్యమాసములు

| | | | |
|---|---|---|---|
| డిసెంబరు నెల 1954 సం॥ | 16 | గు | స 41-11 పూఫ 49-58 ది 8-20 ధనుర్మాస ప్రారంభం |
| | 17 | శు | అ 43-7 ఉఫ 53-21 ది 8-52 దగ్ధయోగం |
| | 18 | శ | న 46-6 హ 57-46 ది 15-48 |
| | 19 | ఆ | ద 49-50 చి 60-10 ది 19-28 |
| | 20 | సో | ఏ 54-24 చి 3-4 దివ 18-26 దగ్ధయోగం |
| | 21 | మం | ద్వా 59-16 స్వా 8-45 దివ 24-11 |
| | 22 | బు | త్ర 60-10 విశా 14-43 దివ 25-44 |
| | 23 | గు | త్ర 4-8 అనూ 20-41 రా 8-10 మాసశివరాత్రి |
| | 24 | శు | చతు 8-40 జ్యే 26-25 రా 20-14 |
| | 25 | శ | ● అమా 13-0 మూ 31-36 దివ 27-16 |
| | | | **పౌష్య మాసము** |
| | 26 | ఆ | శుద్ధపాడ్యమి 16-25 పూషా 36-1 రా 29-18 చంద్రోదయం |
| | 27 | సో | విదియ 18-54 ఉషా 39-29 రా 21-56 శూన్యతిథిః |
| | 28 | మం | తృ 20-14 శ్ర 41-48 రా 24-5 తృతీయాతిథిః |
| | 29 | బు | చ 20-21 ధ 42-57 త్యాజ్యాభావః, చతుర్థితిథిః |
| | 30 | గు | పం 19-13 శత 42-49 దివ 0-47 తిథిద్వయం |
| | 31 | శు | ష 16-50 పూభా 41-29 శేష 2-25 సప్తమీతిథిః, కుమారషష్ఠి |
| జనవరి నెల 1955 సం॥ | 1 | శ | స 13-19 ఉభా 39-5 దివ 4-25 ఆంగ్లసంవత్సరాది |
| | 2 | ఆ | అ 8-47 రే 35-45 దివ 7-20 అమృతయోగం |
| | 3 | సో | న 3-26 ఏష్యం 54-10 దివ 22-23 |
| | 4 | మం | ఏ 51-13 భ 27-19 రా 27-6 స్మార్తైకాదశి-వైకుంఠఏకాదశి |
| | 5 | బు | ద్వా 44-54 కృ 22-46 రా 31-49 మాధ్వవైష్ణవేకాదశి |
| | 6 | గు | త్ర 38-44 రో 18-14 శే 3-23 రా 3-17 |
| | 7 | శు | చతు 33-7 మృ 14-8 రా 5-56 |
| | 8 | శ | ○ పౌ 28-16 ఆర్ద్రా 10-41 రా 11-23 |
| | 9 | ఆ | బ.పాడ్యమి 24-17 పున 8-4 ది 27-35 |
| | 10 | సో | విదియ 21-28 పుష్య 6-29 రా 10-16 ద్వితీయాతిథిః |
| | 11 | మం | తదియ 19-51 ఆశ్రే 6-5 రా 8-28 తిథిద్వయం |
| | 12 | బు | చ 19-28 మ 6-53 దివ 27 36 శూన్యతిథిః |
| | 13 | గు | పం 20 20 పూఫ 8-54 ది 27-54 పంచమితిథిః |
| | 14 | శు | ష 22-24 ఉఫ 12-4 రా 6-27 దక్షిణాయన పుణ్యకాలం |
| | 15 | శ | స 25-28 హ 16-14 రా 9-49 పశువులపండుగ |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.







సేవించి ఆరోగ్య ★★★
సౌందర్యాలు పెంపొందించు
కొంటూ ఉత్సాహంగావుండ
డము ఆమె చేతనవును.

"లోధ్ర" ఋతు దోషాలను
పారద్రోలి ఆరోగ్య సంతోష
సంతానములను సంప్రాప్తింప
జేయును

**కేసరి కుటీరం లిమిటెడ్,**
**రాయపేట, మద్రాస్.**

Lodhra Press, Madras-14.